306236



ANDHRA PATRIKA
Regd. NO. H/HD. 231
ఉదయం

# ఆంధ్రపత్రిక

PUBLISHED SIMULTANEOUSLY FROM HYDERABAD & VIJAYAWADA



వ్యవస్థాపకులు : దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు
హైదరాబాదు ఆదివారం 25-12-88 సంపుటం : 75 సంచిక : 265 పుటలు : 8 + అనుబంధం 24పేజీలు వెల : రు. 1.25 పైసలు

## డి.ఎం.కెకు జనతాదళ్ దాసోహం

మద్రాసు, డిశంబర్ 24

తమిళనాడు శాసనసభ ఎన్నికల్లో పోటీ చేసే విషయమై ఎట్టకేలకు జనతాదళ్-ద్రవిడ మున్నేట్ర కజగం (డిఎంకె)ల మధ్య ఎన్నికల పొత్తు కుదిరింది.

డిఎంకె అధ్యక్షుడు శ్రీ కరుణానిధి ప్రధాన కార్యదర్శి శ్రీకె. అంబళగన్ జనతాదళ్ రాష్ట్ర నాయకులు శ్రీ టి. తిప్పయ్య, శ్రీ జి. కాశీ వర్ధన్ ఈ మేరకు శనివారం ఒక ఒప్పందానికి వచ్చారు. ఈఒప్పందాన్ని అనుసరించి జనతాదళ్‌కు 10 స్థానాలు కేటాయించారు.

జనతాదళ్‌కు కేటాయించిన స్థానాలలోనిలబెట్టినతమఅభ్యర్థులను ఉపసంహరించుకొంటామని శ్రీ కరుణానిధి చెప్పాడు.

జనతాదళ్ చివరి నిముషంలో తన వైఖరిమార్చుకున్నందువల్లే ఈఒప్పందం సాధ్యమైందనిఆయనపేర్కొన్నాడు. తెలుగుదేశం పార్లమెంటరీసంఘ నాయకుడు శ్రీ ఉపేంద్ర ఈ ఒప్పందాన్ని కుదర్చటంలో ప్రముఖపాత్ర వహించినట్లు ఆయన చెప్పాడు.

డి.ఎం.కె. జనతాదళ్‌మధ్య సీట్ల సర్దుబాటులో తలెత్తిన విభేదాలను పరిష్కరించటానికి జాతీయ ఫ్రంట్ అధ్యక్షుడు శ్రీ యన్టీ రామారావు తె.దే పార్లమెంటరీ పార్టీ నాయకుడు శ్రీ ఉపేంద్రను పంపారు. జనతాదళ్ యీ ఎన్నికలలో తమకు 20 స్థానాలు కావాలని మొదటినుండి పట్టుపట్టింది. డి.ఎం.కె అధ్యక్షుడు శ్రీ కరుణానిధి తొలుత అయిదు స్థానాలు మాత్రమేయిస్తామని అన్నాడు. ఈ నెల 23న యీ పొత్తుగురించి శ్రీ కరుణానిధి, శ్రీ బొమ్మై, శ్రీ వి.పి. సింగ్‌మధ్య జరిగిన చర్చలుకూడా విఫలమైనాయి. దీనితో శ్రీ ఉపేంద్ర దౌత్యం ప్రారంభమైంది.

డి.ఎం.కె. తన వైఖరిని మార్చుకోకపోతే జనతాదళ్ ఒంటరిగానే పోటీ చేయాలని ఒక దశలో భావించింది. జనతాలోని శ్రీ తిప్పయ్య వర్గానికి డి.ఎం.కె. వైఖరి అంతగా నచ్చకపోవటంతో రాజీ కష్టసాధ్యమైంది.

చివరకు డి.ఎం.కె.కూడా కొద్దిగా పట్టువిడిచి జనతాదళ్‌కు 10స్థానాలు యిస్తామని ప్రతిపాదించింది. ఈ ప్రతిపాదనకు జనతాదళ్ ఒప్పుకోక తప్పలేదు.

ఎ.ఐ.ఎ.డి.ఎమ్.కె జయలలితవర్గం శాసనసభ ఎన్నికల్లో పోటీ చేసేందుకు 3 వర్గాలతో పొత్తు కుదుర్చుకొంది. సి.పి.ఐకి 13 స్థానాలు, జనతా పార్టీలోని విజయరాఘవన్ వర్గానికి 21 స్థానాలు, రిపబ్లికన్ పార్టీలోని కోబారగాడే వర్గానికి 3 స్థానాలు కేటాయించింది.

డి.ఎం.కె. ముగ్గురితో పొత్తుకుదుర్చుకొంది. శ్రీ టి. తిప్పయ్య నాయకత్వంలోని జనతాదళ్‌కి 10 స్థానాలలోను, సి.పి.ఐ. (ఎమ్) 21 స్థానాలలోనూ, ముస్లిం లీగ్ లతీఫ్ వర్గం 5 స్థానాల్లోను డిఎంకె మద్దతుతో పోటీ చేస్తున్నాయి.

ఇండియన్ యూనియన్ ముస్లిం లీగ్ సమద్ వర్గం 5స్థానాలకు, క్రిష్టియన్ డెమొక్రటిక్ పార్టీ ఒక స్థానానికి, అలిండియా ఫార్వర్డ్ బ్లాక్ ఒక స్థానానికి, ఇండియన్ కమ్యూనిస్టు పార్టీ 10 స్థానాలకు, రిపబ్లికన్ పార్టీ ఒక స్థానానికి, అంబేద్కర్ మూవ్‌మెంట్ నాలుగు స్థానాలకు పోటీ చేస్తున్నాయి. వీరందరూ కాంగ్రెస్‌తో పొత్తు కుదుర్చుకున్నారు.

ఎఐఎడిఎంకె జానకివర్గం శ్రీ శివాజీ గణేషన్ అధ్వర్యంలోని తమిళ మున్నేట్ర మున్నణితో, ఫార్వర్డ్‌బ్లాక్‌లోని శ్రీ అందితేవెర్ వర్గంతో పేజంట్స్‌పార్టీతో ఒప్పందానికి వచ్చింది. ఈ ఒప్పందాన్ని నమసరించి మున్నేట్రమున్నని 50స్థానాలకు, శ్రీ తావెర్ వర్గం 5స్థానాలకు, పీజంట్స్ పార్టీ రెండుస్థానాలకు పోటీచేస్తాయి.

ఇదిలా ఉండగా కాంగ్రెస్‌పార్టీ శాసనసభకు పోటీచేసే తన అభ్యర్థుల తొలి జాబితా శనివారంనాడువిడుదల చేసింది. ఈ జాబితాలో 194మంది అభ్యర్థులున్నారు.

ఈ జాబితాలో తమిళనాడు పి.సి.సి అధ్యక్షుడు శ్రీ మూపనార్ కేంద్ర హోంశాఖ సహాయమంత్రి శ్రీ చిదంబరం పేర్లులేవు.

అయితే లోక్‌సభ మాజీ డిప్యూటీ స్పీకర్ శ్రీ జి. లక్ష్మణన్ అన్నానగర్ నుండి, మాజీ ముఖ్యమంత్రి శ్రీ భక్తవత్సలం కుమార్తె శ్రీమతి సరోజినీ వరదప్పన్ మైలాపూర్‌నుండి పోటీ చేస్తున్నట్లు యీ జాబితాలో పేర్కొన్నారు.

తమిళనాడు పి.సి.సి అధ్యక్షుడు శ్రీ జి.కె మూపనార్ ఒక స్థానం నుండి పోటీ చేస్తారని కాంగ్రెస్(ఐ) ప్రధాన కార్యదర్శి శ్రీ జగన్నాథ పహాడియా తెలిపాడు.

పార్లమెంటరీబోర్డు ఎంపిక చేసిన అభ్యర్థుల జాబితాను ఆయన ఢిల్లీలో విడుదల చేశాడు. తాను పోటీ చేయవలసిన స్థానాన్ని ఆయనే నిర్ణయించుకుంటారని శ్రీ పహాడియా అన్నాడు. శ్రీ మూపనార్ పోటీచేసే పక్షంలో తమ స్థానాన్ని వదులుకుంటామని కాంగ్రెస్ అభ్యర్థులు తమంత తాముగా ముందుకువస్తున్నారని ఆయన తెలిపాడు.

శ్రీ పహాడియా విడుదల చేసిన జాబితాలో కేంద్ర పరిశ్రమలసహాయమంత్రి శ్రీ అరుణాచలం, శ్రీ పి.ఆర్.కుమారమంగళం, శ్రీ దిండివనం రామమూర్తి, శ్రీ ఎల్. బలరామన్‌కూడా వున్నారు.

మద్రాసులో డి.ఎం.కె. అధ్యక్షుడు శ్రీ కరుణానిధి, ఆయన కుమారుడు శ్రీ స్టాలిన్ పోటీచేసే హార్బర్, తౌజండ్ లైట్స్ నియోజకవర్గాలను తమతో పొత్తు కుదుర్చుకొన్న ఇండియన్ ముస్లింలీగ్‌కు వదలివేశామని శ్రీ పహాడియా తెలిపాడు.

### ప్రాంతీయ పార్టీలదే పెత్తనం

''ద్రావిడ'' పదం చేర్చబడి వున్న ప్రాంతీయ పార్టీలే యీసారి కూడ శాసన సభ ఎన్నికలలో పెత్తనం చెలాయిస్తున్నాయి. జాతీయ పక్షాలు స్థానాల కోసం వాటి చుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్నాయి.

కాంగ్రెసు యీసారి డి.ఎం.కెతో గాని అన్నా డి.ఎం.కెలో గాని పొత్తు పెట్టుకోవడంలేదు. జయలలితవర్గంతో పొత్తు విఫలమవడంతో ఒంటరిగానే పోటీలోకి దిగింది.

1971 నుంచి కాంగ్రెసు యీ రెండు వర్గాల డి. ఎం. కె.లతోపాలను బట్ట పొత్తు పెట్టుకుంటూ వచ్చింది. 1971లో డి. ఎం. కె.తో, 1977 అన్నా డి. ఎం. కె.తో, 1980లో మళ్ళీ డి. ఎం. కె, 1984లో మళ్ళీ అన్నా డి. ఎం. కె.లతో యిలా పొత్తు మారుస్తూ వచ్చింది.

1967లో సి. పి. ఐ. (ఎం) డి. ఎం. కె.తో కలసింది. 1971లో విడిగానే పోటీ చేసింది. లోక్‌సభ ఎన్నికలలో డి. ఎం. కె. తోను 1977, 1980, అసెంబ్లీ ఎన్నికలలో అన్నా డి. ఎం. కె.తో, 1984లో డి. ఎం. కె.తో కలసి పోటీ చేసింది.

1967లో సి. పి. ఐ. విడిగాపోటీ చేసి 1971, 1977లో కాంగ్రెసుతో పొత్తు కలుపుకున్నది 1980లో అన్నాడి, ఎం. కె. తో, 1984లో డి. ఎం. కె. తో కలసింది.

### ఎం.జి.ఆర్ సంస్మరణ

తమిళనాడు మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎం. జి. రామచంద్రన్ ప్రథమ వర్ధంతిని ప్రజలు భక్తి శ్రద్ధలతో శనివారంనాడు జరుపుకున్నారు.

శ్రీ రామచంద్రన్ సమాధి దగ్గరికి శ్రీమతి జానకీ రామచంద్రన్ ఒంటరిగా వెళ్ళి పుష్పగుచ్ఛాన్ని సమర్పించి తన భర్త సంస్మరణార్థం మౌనవ్రతం ఉపవాసం పాటిస్తున్నారు.

ఎ.ఐ.ఎ.డి ఎం.కె.కి చెందిన జయలలిత వర్గంవారు జయలలిత నేతృత్వంలో మౌంట్ రోడ్‌లోని అన్నా విగ్రహం దగ్గర నుండి మెరీనాలోని సమాధి వరకు ఊరేగింపు చేశారు. వీరితోపాటు ఆ పార్టీ ప్రధాన కార్యదర్శి శ్రీ హెచ్. వి. హండే కోశాధికారి శ్రీ యస్. తిరునవకరసు కూడా ఉన్నారు. తమిళనాడు గవర్నర్ శ్రీ పి. సి. అలెగ్జాండర్ సతీమణితో కలసి రామచంద్రన్ సంస్మరణ కార్యక్రమాలకు ప్రారంభ సూచకంగా పుష్పగుచ్ఛాలు సమర్పించి సమాధి దగ్గర మొక్కలు నాటారు.

## పానమ్ సంస్థకు "ఫా" హెచ్చరిక

వాషింగ్టన్, డిసెంబర్ 24:

అమెరికాకు చెందిన పానమ్ అంతర్జాతీయ విమానాశ్రయం తన విమానాల భద్రతకు మరిన్ని చర్యలు కట్టుదిట్టంగా తీసుకోవాలని ''ది ఫెడరల్ ఎవియేషన్ అడ్మినిస్ట్రేషన్'' (ఫా) అమెరికా ప్రభుత్వానికి సూచించింది. ఇలా 'ఫా' బహిరంగంగా అమెరికాకు సూచన చేయడం యిది మొదటిసారి.

క్రిస్మస్ శుభాకాంక్షలు

న్యూఢిల్లీ, డిసెంబర్ 24:

రాష్ట్రపతి శ్రీ ఆర్. వెంకట్రామన్ క్రిస్మస్ సందర్భంగా దేశ ప్రజలకు శుభాకాంక్షలందచేశాడు. పరస్పరం నమ్మకం పెరగడానికి, శాంతి సాధించడానికి కలసి ప్రార్థనలు చేయవలసిందిగా శ్రీవెంకట్రామన్ ప్రజలను కోరారు.

## ఇవిగో! 'గాలి' ఆస్తులు

తిరుపతి, డిసెంబర్ 24 :

రాష్ట్ర అటవీశాఖమంత్రి శ్రీ గాలి ముద్దు కృష్ణమనాయుడు శనివారంనాడు తన ఆస్తులను ప్రకటించారు.

తన సోదరునితో కలిసి తనకు 20 హెక్టార్ల సాగుభూమి వుందని ఋదిదాని కింద సాగవుతోందని ఆయన ప్రకటించాడు. అదికాక 2000 కాసుల బంగారం, రు. 2 లక్షల నగదు వున్నాయని ఆయన తెలిపాడు.

తిరుపతిలో 300 చదరపు గజాల నివేశనస్థలం స్వగ్రామంలో రెండు యిళ్ళు వున్నట్లు కూడా ఆయన చెప్పాడు. రు 15 వేల విలువైన జీవిత భీమా పాలసీ రు 12 వేల పెట్టుబడులు తన పేర వున్నట్లు శ్రీ నాయుడు వెల్లడించాడు. తాను మంత్రి పదవి చేపట్టిన తరువాత రు 15 వేలతో విదేశాలలో తయారైన ఒక రివాల్వర్‌ను కొనుగోలు చేశానని అయన చెప్పారు. తనకు ఒక స్కూటర్, ఒక టెలివిజన్ ఒక వీడియో కేసెట్ రికార్డర్ వున్నాయనికూడా మంత్రి తెలిపారు. మంత్రి పదవిలోనికి వచ్చిన తరువాత తాను సంపాదించినది ఏమీ లేదని శ్రీ ముద్దుకృష్ణమనాయుడు అన్నారు.

ఈ నెల ప్రారంభంలో ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు తన ఆస్తులను ప్రకటించిన అనంతరం ఆస్తులు ప్రకటించిన మంత్రులలో శ్రీ నాయుడు మూడవ వారు ఇంతకుముందే మంత్రులు శ్రీ అల్లాడి పి. రాజకుమార్, శ్రీ పి. ఇంద్రారెడ్డి తమ ఆస్తులను ప్రకటించిన సంగతి తెలిసినదే.

### భద్రత బాగా తెలియాలి

హైదరాబాద్, డిశంబర్ 24,

భద్రతకు సంబంధించిన అనేక విషయాలు మనం ఇంకా తెలుసుకోవాల్సివుందని రాష్ట్ర కార్మికమంత్రి శ్రీ పి. శివారెడ్డి అన్నారు.

శనివారంనాడు హైదరాబాద్‌లో జాతీయ భద్రతా మండలి అధ్వర్యంలో రాజమండ్రి ఎ.పి పేపర్‌మిల్స్ సౌజన్యంతో రూపొందించిన వాట్ ఈజ్ సేఫ్టీ అనే గ్రంధాన్ని ఆయన ఆవిష్కరించాడు.

ఆ సందర్భంగా ఏర్పాటు చేసిన కార్యక్రమానికి శ్రీ పి. మధుసూధనరావు అధ్యక్షత వహించాడు. ఎ. పి పేపర్‌మిల్స్ యం.డి.శ్రీయం.విజి.రావు కార్మికనాయకుడు శ్రీ సి. సుబ్బారావులు ప్రసంగించారు.

శ్రీ అప్పారావు వందనసమర్పణ చేశాడు.

### ట్యాంకర్ పేలిపోయి అయిదుగురి మృతి

చెన్నైస్సె, డిసెంబర్ 24:

ఒక ప్రొపేన్ ట్యాంకర్‌లారీహైవేపై పేలిపోవడంచేత 5గురు చనిపోగా, 12మందికి దెబ్బలు తగిలినట్లు తెలిసింది.

700అడుగులు ప్రాకిన ఈ మంటల్లో 5ఇళ్ళు, మరో 4వాహనాలు దగ్ధమైపోయాయని ఫైర్‌కేడ్‌డెన్ ఛెన్నీ మేక్‌హో తెలియజేశాడు.

నిత్య భారతం

అర్జున్‌సింగ్‌గారి
అధ్యాయం మారి
అవస్థ మొదలట
అంతా అధ్వాన్నమట!

రాజకీయాలు ముదిరి
రాయబారాలు జరిగి
రాజీవ్‌ని దూరం చేసాయట
రామ్ రామ్ అన్పిస్తున్నాయట

లోపలి వాళ్ళ
లోతుగగోతులు తీస్తే
లోగుట్టు ఏమవుతుంది
లొట్టి పిట్ట అవుతుంది!

—శ్రీరమేశ

## న్యాయవ్యవస్థపై 'దేశం' దెబ్బ

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

హైదరాబాద్, డిసెంబర్ 24:

భారత రాజ్యాంగంలో లెజిస్లేచర్, ఎగ్జిక్యూటివ్, న్యాయవ్యవస్థలకుగల అధికారాలు వేర్వేరుగా నిర్వచించి ఒక వ్యవస్థ మరొక వ్యవస్థ అధికారాలను హరింపజేయకుండా రాజ్యాంగ నేతలు జాగ్రత్తలు తీసుకుంటే తెలుగుదేశం ప్రభుత్వం అందుకు భిన్నంగా వ్యవహరిస్తూ న్యాయ వ్యవస్థను తమ చెప్పుచేతల్లో పెట్టుకోవడానికి ప్రయత్నిస్తున్నది.

ఇందుకు ఉదాహరణగా తాలూకా స్థాయిలోగల మేజిస్ట్రేట్లను ఒక కలం పోటుతో ఉద్యోగాలనుంచి తొలగించేందుకు ఇటీవల రాష్ట్రప్రభుత్వం జారీ చేసిన జి.వో.నుపేర్కొనవచ్చు.

ఒకసారి నియమించిన మేజిస్ట్రేట్లను బదిలీలు, ప్రమోషన్లు ఇచ్చే అధికారం తప్ప, తీవ్రమైన ఆరోపణలుపస్తేతప్ప సాధారణంగా తొలగించే అధికారం ప్రభుత్వానికి ఉండదు. అప్పుడు ఒక జి.వో.ను జారీచేస్తూ ఏ కారణం లేకుండానే నెలజీతంగాని లేక నెల ముందుగా నోటీసు ఇచ్చిగాని మేజిస్ట్రేట్లను తొలగించే అధికారాన్ని రాష్ట్ర ప్రభుత్వం సంక్రమింప చేసుకుంది.

తాలూకా మేజిస్ట్రేట్ల నియామకం, బదిలీలు, ప్రమోషన్లు న్యాయశాఖ పరిధిలో ఉండటంవల్ల మేజిస్ట్రేట్లను అదుపు చేసే బాధ్యతలనుకూడా న్యాయశాఖకే ఉండాలనే ఆలోచనతో గతనెల రాష్ట్ర ప్రభుత్వం ఏ కారణాలు చెప్పకుండానే తాలూకా మేజిస్ట్రేట్లకు ఉద్వాసనచెప్పే జి.వో.ను జారీచేసింది.

తాలూకా మేజిస్ట్రేట్లకు జీతభత్యాలు, అలవెన్సులుకూడా రాష్ట్రప్రభుత్వం చెల్లించడం,వారి నియామకాలు, బదిలీలు రాష్ట్రప్రభుత్వ న్యాయశాఖ పరిధిలో ఉండటంవల్ల, వారినితమ చెప్పుచేతల్లో పెట్టుకోవడానికి ప్రభుత్వానికి అనుకూలంగా లేని మేజిస్ట్రేట్లను తొలగించడానికి ఈ జి.వో.ను నిర్దేశించినట్లు చెప్పబడుతోంది.

మేజిస్ట్రేట్లను ఎందుకు తొలగిస్తున్నారో కారణాలు చెప్పకుండా, సంజాయిషీ అడగకుండా తొలగించే ఈ జి.వోవల్ల తాలూకా స్థాయిలోని మేజిస్ట్రేట్లు ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఏ విధమైన తీర్పులు ఇవ్వకూడదని ఈ జి. వో.ను జారీ చేయడంలో ప్రభుత్వ అంతరార్థంగా కనపడుతున్నదని ఒక మేజిస్ట్రేట్ వ్యాఖ్యానించారు.

రాష్ట్ర ప్రభుత్వం ఈ జి.వో ను జారీ చేయడం వల్ల న్యాయవ్యవస్థ స్వతంత్రప్రతిపత్తిని కోల్పోతున్నదని, ఈజి.వోను సాకుగా తీసుకుని ప్రభుత్వానికి అనుకూలంగా తీర్పులు ఇచ్చే మేజిస్ట్రేట్లకు మాత్రమే ప్రమోషన్ అవకాశాలుంటాయని ఈ మేజిస్ట్రేట్ తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు.

గతంలో క్సానిడెన్షియల్ పైళ్ళ, సీనియారిటీ ప్రాతిపదికగా తాలూకా మేజిస్ట్రేట్‌లకు ప్రమోషన్ అవకాశాలను ఈ జి. వో. దెబ్బతీస్తున్నదని, ప్రభుత్వం తన ఇష్టం వచ్చిన వారికే ప్రమోషన్ ఇవ్వడం, అవసరంలేని వారిని తొలగించడానికి ఈ జి. వో. దోహదపడుతుందని ఆయన అన్నారు.

ఇది ఇలాఉండగా తాలూకా మేజిస్ట్రేట్‌లకు సబ్‌జడ్జీలుగా ప్రమోషన్ జాబితాలో 32మంది ఉన్నారు. సీనియారిటీలో ప్రమేయం లేకుండా నలుగురు మేజిస్ట్రేట్లకుసబ్‌జడ్జీలుగా ప్రమోషన్ ఇవ్వడానికి రాష్ట్ర ప్రభుత్వం మార్గాలు అన్వేషిస్తున్నది.

ఇందుకోసం 32మంది మేజిస్ట్రేట్ ప్రమోషన్ జాబితాను మూడు నాలుగు జాబీలుగా విడదీసి ఒక్కొక్క జాబ్ నుంచి ఒక్కొక్కరికి సబ్ జడ్జీగా ప్రమోషన్ ఇవ్వాలని రాష్ట్రప్రభుత్వం యోచిస్తున్నట్లు తెలిసింది.

## శ్రీదేవితండ్రికి కాంగ్రెస్ టికెట్

న్యూఢిల్లీ, డిసెంబర్ 24 :

ప్రముఖ చలనచిత్రనటి కుమారి శ్రీదేవి తండ్రి శ్రీ కె. అయ్యప్పన్‌కు తమిళనాడు ఎన్నికలలో కాంగ్రెస్ టికెట్ లభించింది.

ఆయన శివకాశి నుండి పోటీ చేస్తారు. ఇటీవలి కాలంలో కుమారి శ్రీదేవి రాజకీయ రంగ ప్రవేశం గురించి పలు వదంతులు విన వచ్చాయి. ఆమె కాంగ్రెస్ పార్టీలో చేరుతుందనే వార్తలు వెలువడ్డాయి. కుమారి శ్రీదేవి తండ్రికి పార్టీ టికెట్ యిచ్చినట్లు కాంగ్రెస్ (ఐ) ప్రధాన కార్యదర్శి శ్రీ జగన్నాథ పహాడియా ప్రకటించాడు. విలేఖరుల సమావేశంలో పాల్గొనటానికి ముందు ఆయన తమిళనాడు పి.సి.సి. అధ్యక్షుడు శ్రీ మూపనార్‌తో రెండుగంటలపాటు రహస్య చర్చలు జరిపాడు. ప్రస్తుతం విడుదలచేసిన జాబితాలో మార్పులు, చేర్పులు జరిగే అవకాశం వుందని ఆయన అన్నాడు.

కాంగ్రెస్‌పార్టీలోయిప్పటికే ప్రముఖ నటీమణి శ్రీమతి వైజయంతిమాల, మహానటి దీప వున్నారు. వీరికితోడు కుమారి శ్రీదేవి ప్రచార రంగంలోకి దిగితే....

## తెలుగు యువతపై అధిష్ఠానవర్గం అసంతృప్తి

హైదరాబాదు, డిశంబర్ 24:

రాష్ట్ర తెలుగుయువత కార్యవర్గం పనితీరుపట్ల పార్టీ నాయకత్వం తీవ్ర అసంతృప్తి వ్యక్తంచేస్తున్నట్లు తెలుస్తోంది.

గత మహానాడులో తెలుగు యువత కార్యవర్గం ఏర్పాటు అయినప్పటినుండి తెలుగుయువత అధ్యక్ష కార్యదర్శులు వారి విధులు సరిగ్గా నిర్వర్తించ లేకపోయారన్న ఫిర్యాదులు పార్టీ నాయకులకు అందాయి. తెలుగుయువత నాయకులు పార్టీ కార్యక్రమాల్ని సందేశపథకాల్ని ప్రచారంచేసే బాధ్యత విస్మరించి దాదాపు అన్ని జిల్లాల్లోను పైరవీలే ప్రధానంగా చేస్తుండటంవల్ల పార్టీ నాయకత్వం అసంతృప్తి వ్యక్తం చేస్తున్నట్లు తెలుస్తోంది.

పార్టీ పేరు చెప్పుకొని సొమ్ము చేసుకొంటున్నారని యువత సారథుల పైనే కొందరు ఫిర్యాదు చేసారు. లారీ ట్రాన్సుపోర్టు ఆపరేటర్ల నుండి డబ్బు వసూలు చేయటంపట్ల నిరసనగా కరీంనగర్ జిల్లా అపరేటర్లు ఈ విషయాన్ని గృహ నిర్మాణ శాఖమంత్రి శ్రీ రాజేశంగౌడకు, రాష్ట్ర తెలుగుదేశం అధిష్టాన వర్గం నాయకులకు తెలియజేసారు.

తెలుగు యువత అధ్యక్షులు కూడా పార్టీ కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొన లేదని విమర్శలు ఉన్నాయి. మిగతా కార్యవర్గం జిల్లా విభాగాల కార్యవర్గం సమావేశాలకే పరిమితం కావటంవల్ల పార్టీ వర్గాలు అసంతృప్తితో ఉన్నాయి. ఈ కారణాల దృష్ట్యా ఆరునెలల క్రితం ఏర్పాటు చేసిన తెలుగు యువత కార్యవర్గాన్ని పునర్ వ్యవస్థీకరించాలని పార్టీ నాయకులు భావిస్తున్నారని తెలిసింది.

గతంలో తెలుగు యువత అధ్యక్ష పదవికి వన్నె తెచ్చిన వారిలో ముఖ్యమంత్రి పెద్దల్లుడు, ప్రస్తుత రాష్ట్ర వైద్యశాఖ మంత్రి శ్రీదగ్గుబాటి వెంకటేశ్వరరావు మినహా మరెవ్వరు శ్రద్ధ చూపలేదు.

తెలుగు విద్యార్థి విభాగం పని తీరు పట్ల కూడా అసంతృప్తి వ్యక్తం చేసినట్లు రాజకీయ వర్గాల భోగట్టా. విద్యార్థి విభాగం ఉన్నదీలేనిదీ కూడ విద్యార్థి లోకానికి తెలియదు. ఎప్పుడో ఒకప్పుడు పత్రికా ప్రకటనలతో సరిపెట్టు కుంటారనీ, ఈ వర్గంలోని వారికి విద్యార్థులతో దాదాపుగా సంబంధాలు లేవనీ, అందువల్ల, తెలుగు విద్యార్థి,వల్ల పార్టీ నాయకత్వానికి ఎంత మేలుకల్గిందనే విషయంకూడ ఆలోచించ గలరని తెలుస్తోంది.

## ప్రతిపక్షాలకు

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

హైదరాబాద్, డిసెంబర్ 24:

టి.వి. రేడియో, ముఖ్యమంత్రి, మంత్రులు మిత్రపక్షాల కార్యక్రమాల వార్తలను పూర్తిగా విస్మరిస్తూ కాంగ్రెస్ (ఐ) పార్టీ ప్రచారసాధనాలుగా మారాయని తెలుగుదేశం పార్టీ దాని మిత్ర పక్షాల నాయకులు శనివారం నాడు ధ్వజమెత్తాడు.

ఈవైఖరిని తాము తీవ్రంగా ఖండిస్తున్నామని దీనిని కొనసాగిస్తే ప్రత్యక్ష కార్యాచరణకు దిగుతామని వారు విలేకర్లతో మాట్లాడుతూ హెచ్చరించారు. తెలుగుదేశం పార్టీ నాయకుడు శ్రీ చంద్రబాబునాయుడు, సి.పి.ఎం. నాయకుడు శ్రీ నర్రారాఘవరెడ్డి, బి.జె.పి. నాయకుడు శ్రీఎం. వెంకయ్యనాయుడు జనతా అధ్యక్షుడు శ్రీ సి. బాబుల్‌రెడ్డి విలేఖరుల సమావేశంలో పాల్గొన్నారు.

గవర్నర్‌ను ప్రతిరోజు టి. వి.లో చూపిస్తున్నారని చోటా మోటా కాంగ్రెస్(ఐ) నాయకులను సైతం చూపించకుండా వదలడంలేదని వారు చెప్పారు. సాదార్ సమస్య పై తాము ఆందోళన చేస్తుంటే ఒక్క కార్యక్రమం కూడా చూపడం లేదని పైగా అందుకు వ్యతిరేకంగా చెప్పే వారికి ఈ సాధనాలు ప్రచారం ఇస్తున్నాయని వారు విమర్శించారు.

రేడియో, టి.వి.ల ద్వారా ఎవరెవరికి ఎంత ప్రచారం ఇస్తారనేది 15రోజుల పాటు వివరాలను నమోదు చేసి ప్రజలకు తెలపాలని తామందరం నిర్ణయించుకున్నామని వారు చెప్పారు. ఈ విధంగా నమోదు చేసిన తర్వాత పరిస్థితిని సమీక్షించి ఏమి చేయాలో నిర్ణయిస్తామని వారు తెలిపారు.

రేడియో, దూరదర్శన్ విలేకరులు తెలుగుదేశం, ఇతర మిత్రపక్షాలు పిలిచే విలేకరుల సమావేశాలకు కూడా రారని శ్రీచంద్రబాబునాయుడు అన్నాడు.

ఈ ప్రచార సాధనాలకు స్వతంత్ర ప్రతిపత్తిని కల్పించాలని తాము కోరుతున్నామని తెలిపాడు.

### ఒకటి - సు'దూరదర్శన్'

### మరొకటి - గగనకుసుమం

### రాష్ట్ర ప్రభుత్వాన్ని తిడితేనే ప్రచారం

బి. జె. పి మార్క్సిస్టుపార్టీ, జనతా పార్టీలు రాష్ట్ర ప్రభుత్వాన్ని విమర్శిస్తే, టి.వి. రేడియోలలో చెపుతున్నారని కేంద్ర ప్రభుత్వాన్ని తిడితే చెప్పడం లేదని శ్రీ వెంకయ్యనాయుడు విమర్శించాడు.

పెండింగ్ ప్రాజెక్టులసమస్యపైపెద్ద ఎత్తున ర్యాలీలు నిర్వహిస్తే పట్టించుకోలేదని నిన్న విలేఖర్ల సమావేశం పెట్టి ఉద్యమం గురించి చెబితేదానిని తొక్కిపెట్టి శ్రీ రాజగోపాల్‌రెడ్డిపంపిన పెల్లిగాం గురించి మాత్రమే చెప్పారని అన్నాడు.

రాష్ట్ర ప్రభుత్వం బస్ చార్జీల అమలును నిలిపినా బస్ రోకో ఉద్యమం కొనసాగుతుందని ఏ.సీ.సి. అధ్యక్షుడు చేసిన ప్రకటనను యథావిధిగా ప్రసారం చేశారని చెప్పాడు.

### కేంద్రమే ఇవ్వొచ్చుకదా!

రాష్ట్ర ప్రభుత్వం సహకార రుణాలు వడ్డీలకు రాయితీ ఇస్తూ వాణిజ్య బ్యాంకుల నుంచి ఋణాలు తీసుకున్న వారిని విస్మరిస్తున్నదని కేంద్ర పరిశ్రమల మంత్రి శ్రీ జలగం వెంగళరావు చేసిన ప్రకటనను ప్రస్తావిస్తూ బ్యాంకులు కేంద్రం చేతిలో ఉన్నందున కేంద్రమే స్వల్ప వడ్డీలో రైతులకు ఋణాలు ఇప్పించవచ్చు కదా! అని శ్రీ చంద్రబాబునాయుడు అన్నాడు.

# నాబార్డ్‌దే మాకు బాకీ

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)
హైదరాబాద్, డిసెంబర్ 24:

'నాబార్డ్'కు రాష్ట్ర ప్రభుత్వం రు.24 కోట్లు బాకీవుందని కేంద్ర పరిశ్రమల మంత్రి శ్రీ వెంగళరావు చేసిన ప్రకటనను రాష్ట్ర సహకారశాఖ మంత్రి శ్రీ ఎస్. యతిరాజారావు ఖండించారు. రాష్ట్ర ప్రభుత్వం నాబార్డ్‌కు ఎలాంటి బాకీ లేదని, రు. 80 లక్షలు 'నాబార్డే' రాష్ట్ర ప్రభుత్వానికి బాకీ వుందని ఆయన అన్నారు.

శనివారం నాడిక్కడ ఏర్పాటు చేసిన పత్రికా ప్రతినిధుల సమావేశంలో శ్రీ యతిరాజారావు మాట్లాడుతూ, ఆ రు. 24 కోట్లు పాత బాకీల క్రింద ఏనాడో జమచేశామని అన్నారు.

కేంద్రమంత్రి చేసిన ప్రకటనను ఆయన 'బుద్ధిలేనివాళ్లు' చేసే ప్రకటనగా అభివర్ణించారు.

గత ఏడాది జూన్ 30 నాటికి రైతులకు 5 న్నర శాతం వడ్డీ రాయితీ, అపరాధవడ్డీ మాఫీ చేశామని, అందుకుగాను రాష్ట్ర ప్రభుత్వానికి రు. 93 కోట్లు ఖర్చయిందని ఆయన అన్నారు. ఆరోజుకు రైతుల నుండి వసూలయిన మొత్తంలో మరో రు. 69 కోట్లు రాష్ట్ర సహకార బాంకుకు 1987 జనవరి 5న చెల్లించినట్లు జి. ఓ. ఎం. ఎస్. నెం. 7 ద్వారా 'నాబార్డ్'కు తెలియ జేశామని ఆయన అన్నారు. ఇక మిగిలిన రు.24కోట్లు(కేంద్రమంత్రిపేర్కొన్న) పాతబాకీల క్రింద జమయిందని శ్రీయతిరాజారావు అన్నారు. కాబట్టి రు. 24 కోట్లు రాష్ట్ర ప్రభుత్వం నాబార్డ్‌కి బాకీ వుందనే విషయం వాస్తవ విరుద్ధమైన ప్రకటనగా ఆయన పేర్కొన్నారు.

వాణిజ్య బాంకులు, గ్రామీణబాంకుల నుంచి ఋణాలు తీసుకునే రైతులకు రాష్ట్రం రాయితీ ఇవ్వడం లేదనేది అవాస్తవమైన విమర్శ అని శ్రీ యతిరాజారావు అన్నారు. రాష్ట్రంలో వాణిజ్య బాంకులు దత్తత తీసుకొన్న సహకార బాంకులు 245 వున్నాయని, ఇవిగాక, 56 రైతుసేవాసహకార సంఘాలు వున్నాయని, వాటన్నిటి ద్వారా రైతులు తీసుకునే ఋణాలపై వడ్డీ రాయితీ ఇస్తోందని, దీనికి గాను 1987 మే 5వ తేదీన జి.ఓ.ఎం.ఎస్. నెం. 230 ద్వారా ఉత్తర్వులు జారీ చేశామని ఆయన వివరించారు.

రాబోయే రబీపంట కాలానికి రైతులకు రూ. 100 కోట్ల ఋణాలు ఇవ్వనున్నామని, దీనికి సంబంధించి 'నాబార్డ్' నియమనిబంధనలకు కట్టుబడి వుంటామని ఈనెల 20న తాము హామీ ఇచ్చామని ఆయన తెలిపారు.

రాష్ట్ర ప్రభుత్వం గత ఏడాది నవంబర్ 29 నాటికి ఖరీఫ్ పంటలకు 5న్నరశాతం వడ్డీ రాయితీ ఇచ్చిందని, దీనిని రాబోయే రబీపంట కాలానికి కూడా కొనసాగిస్తామని, ఈ రాయితీ విషయాన్ని వెనక్కి తీసుకునే ప్రసక్తే లేదని శ్రీ యతి రాజారావు స్పష్టం చేశారు.

ఇకపై బాంకుల ద్వారా కాక ఇతర సహకార సేవాసంఘాల ద్వారా రైతులకు రాయితీ సౌకర్యం కల్పించే ఆలోచన తమ ప్రభుత్వానికి ఉన్నట్లు ఆయన తెలిపారు.

నాబార్డ్ ఇచ్చే 10 శాతం రాయితీలో 2 శాతం ప్రాథమిక సంఘాలకు, 2 శాతం జిల్లా కేంద్ర సహకార బాంకులకు, అర్ధ శాతం రాష్ట్ర సహకార బాంకులకు వెళుతుందని, ఇక మిగిలిన 5 న్నర శాతమే నాబార్డ్ ఇస్తున్నదని శ్రీ యతిరాజారావు వివరించారు.

రైతుల సంక్షేమాన్ని దృష్టిలోవుంచుకొని రాష్ట్ర ప్రభుత్వం రాయితీలు ఇస్తుంటే దానికి అడ్డుకొట్టాలని కేంద్రం ప్రయత్నిస్తోందని ఆయన విమర్శించారు.

# పారిశ్రామిక పట్టణంలో ప్రధాని

షాంఘై, డిశంబర్ 24:

ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ తమ 5 రోజుల చైనా పర్యటనలో చివరి రోజు అయిన శుక్రవారంనాడు "మాలు" పారిశ్రామిక పట్టణాన్ని సందర్శించారు.

శుక్రవారం ఉదయం క్సియాన్ నుండి ప్రత్యేక విమానంలో షాంఘై చేరుకున్నారు. షాంఘై మేయర్ శ్రీ ఝూరాంగ్జీ ప్రధానికి స్వాగతం చెప్పారు.

మాలు పట్టణంలో ప్రధాని శ్రీరాజీవ్ గాంధి ఒక గంటసేపు గడిపి పారిశ్రామిక రంగంలో చైనా సాధించిన ప్రగతిని గూర్చి తెలుసుకున్నారు. పట్టణ మేయర్ రాంగ్జీతో విందు చేసిన అనంతరం ప్రధాని స్వదేశం బయలు దేరతారు.

# విమాన ప్రమాదం మృతులలో 7 గురు భారతీయులు

న్యూఢిల్లీ, డిశంబర్ 23: బుధవారం రాత్రి దుర్ఘటనకు గురైన అమెరికాకు చెందిన బోయింగ్ 747 విమానంలో మనదేశానికి చెందినవారు 7 గురు ఉన్నారని ఎయిర్‌లైన్స్ అధికారులు తెలియజేశారు, పాన్ అమెరికన్ ఎయిర్‌వేస్‌కు చెందిన ఈ విమానం బుధవారం రాత్రి దక్షిణ స్కాట్లండ్‌లో కూలిపోయి 273 మంది మరణించిన విషయం పాఠకులకు విదితమే.

ఈ విమానంలో బొంబాయి నుండి న్యూయార్క్ వెళుతున్న మాజీ భారతీయ జాతీయ ట్రిపుల్ జంప్ చాంపియన్ కుమారి మృదులా ప్రతో పాటు ఢిల్లీనుండి ఫ్రాంక్‌ఫర్ట్ మీదుగా లండన్ వెళుతున్న మరో 6 గురు భారతీయ ప్రయాణీకులున్నట్లు పానం ఎయిర్‌వేస్ ప్రతినిధి తెలియ జేశారు.

అందులో ముగ్గురు ఆగ్రాలోని ఒకే కుటుంబానికి చెందినవారు. వారి పేర్లు శ్రీ ఓందీక్షిత్, శ్రీమతి శాంతి దీక్షిత్, శ్రీమతి ఊ.దీక్షిత్ వీరు ముగ్గురూ పంజాబ్‌లోని మోగా నుండి న్యూయార్క్ వెళుతున్నారు.

# మోదుకూరి జాన్సన్ అస్తమయం

హైదరాబాదు, డిశంబర్ 24:

ప్రముఖ నాటకకర్త, సినిమా రచయిత శ్రీ మోదుకూరి జాన్సన్ ఈ ఉదయం హైదరాబాద్‌లో హృద్రోగంతో మరణించారు. ఆయన వయస్సు సుమారు 55 సంవత్సరాలు.

'నటనాలయం' నాటకం ఆయనకు మంచిపేరు తెచ్చిపెట్టింది. గత రెండు దశాబ్దాల కాలంలో ఆయన తెలుగు సినిమాలకు పాటలు, మాటలు వ్రాశారు.



శనివారంనాడు హైదరాబాద్‌లో జరిగిన కేకుల ప్రదర్శనలో ఆకర్షణీయంగా రూపొందించిన రకరకాల కేకులు ఇవిగో.

# రైతుపై కపట ప్రేమ ఒలికించకండి

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)
హైదరాబాదు, డిశంబర్ 24:

సహకార సంస్థల ఎన్నికలు జరపటంలో రాష్ట్ర ప్రభుత్వాలు వివిధమైనజోక్యం వాంఛనీయం కాదని ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ నేదురుమల్లి జనార్థన రెడ్డి నేడు గాంధీభవన్‌లో జరిగిన పత్రికా విలేకర్ల సమావేశంలో సూచించారు.

బాంక్ శాఖలలో ప్రభుత్వ జోక్యం సరికాదని, రాష్ట్ర ప్రభుత్వాలు రైతులకిచ్చే రాయితీలను తతిమ్మా ప్రభుత్వ శాఖల ద్వారా ఇవ్వాలని పేర్కొన్నారు.

తెలుగుదేశంపార్టీ 'నాబార్డ్' విషయాన్ని గోరంత కొండంతలు చేస్తున్నదని, ఈ సమస్యలు సామరస్య పూర్వకంగా పరిష్కరించుకోవాలి కాని అమాయక రైతులను పెడతోవ పెట్టకూడదని, తమ రాజకీయ స్వార్థంలో వారిని పావులుగా వాడుకోవద్దని శ్రీ జనార్ధనరెడ్డి ప్రభుత్వాన్ని కోరారు.

రాష్ట్ర ప్రభుత్వం రు. 24 కోట్లు 'నాబార్డ్'కు బాకీ ఉందని, ఇంత వరకు చెల్లించలేదని బాంక్ వ్యవహారాల్లో ప్రభుత్వాల జోక్యాన్ని అయనపూర్తిగా వ్యతిరేకించారు.

రైతులపట్ల తమకు ఎంతో సానుభూతి ఉందని వారికి మంచి జరుగుతున్నదంటే సంతోషించే వారిలో తాము మొదటి వారమని జనార్ధనరెడ్డి తెలియ జేశారు.

## చేనేత కార్మికుల ఆకలి చావులు

ప్రకాశం జిల్లాలో గత ఆరుమాసాల నుండి దాదాపు 24 మంది చేనేత కార్మికులు ఆకలిచావులకు గురయ్యారని రాష్ట్ర ప్రభుత్వం వారి పట్ల ఏవిధమైన సహాయ సహకారాలందించక పోవడం శోచనీయమైన విషయమని శ్రీ జనార్ధనరెడ్డి విచారం వెలిబుచ్చారు.

ప్రభుత్వం నిర్లక్ష్యంగా వ్యవహరిస్తే మరో 15 చావులు జరుగగలవని వెంటనే ప్రకాశం జిల్లాలోని ఈ పుడుపాలెం, జాండ్రపేట, వేటపాలెం, పందిళ్ళపల్లె తదితర గ్రామాల్లోని చేనేత కార్మికుల అభివృద్ధికి ప్రభుత్వం వెంటనే సహాయం అందించాలని శ్రీ జనార్ధన్‌రెడ్డి కోరారు.

సహాయక కార్యక్రమాల క్రింద వారికి వైద్యసదుపాయాలు, కిలో రెండురూపాయల బియ్యం, వృద్ధాప్య పింఛన్లు మంజూరు చెయ్యాలని, వెంటనే ప్రభుత్వపై సహాయాలు అందించని పక్షంలో మాజీ మంత్రి శ్రీ రోశయ్య ఆధ్వర్యంలో 'రాస్తా రోకో' కార్యక్రమం నిర్వహిస్తామని పిసిసి అధ్యక్షుడు పేర్కొన్నారు.

చేనేత కార్మికుల విషయమై తాను ప్రధాని రాజీవ్‌గాంధికి సమగ్ర నివేదిక అందజేశానని కేంద్ర ప్రభుత్వ సంస్థ అయిన నాబార్డ్ నేషనల్ 'టెక్స్‌టైల్' కార్పొరేషన్ ద్వారా చేనేత కార్మికులకు సహాయ సహకారాలందించుటకు ప్రయత్నిస్తామని శ్రీ జనార్ధనరెడ్డి తెలిపారు.

తెలుగుదేశం పార్టీ ఇటీవల రాయలసీమ హక్కుల కోసం పోరాటం సాగిస్తున్న శాసనసభ్యులు శ్రీ ఎం. వి. మైసూరా రెడ్డి, శ్రీ కె. రాంభూపాల్ రెడ్డిని పోలీసుల అడ్డుకొని అనంతపురంలో జరిగే బహిరంగసభకురాకుండా అడ్డుకొన్నారని, పోలీసులు టిడిపి తొత్తులై పోతున్నారని ఆయన విమర్శించారు.

రాజీవ్‌గాంధీ ఇటీవల చైనా పర్యటన వల్ల భారత–చైనా మైత్రి పెరుగగలదని అందుకొరకు పి. సి. సి. ఒక కార్యక్రమాన్ని చేపట్టునుందని, జిల్లా కేంద్రాల్లో బహిరంగసభలు ఏర్పాటు చేస్తున్నామని, పైసభలకు లెఫ్టిస్టు పార్టీలను కూడా ఆహ్వానిస్తున్నామని శ్రీ జనార్ధన్ రెడ్డి తెలియజేశారు.

FERENCE ... JURISTS AND SPIRIT

# కుడి ఎడమల స్వార్థమే స్వార్థం

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)
హైదరాబాద్, డిశంబర్ 24:

ఎక్కడచూసినా అధికార దాహం, అక్రమ ధనార్జన, స్వార్థమే నెలకొని ఉన్నదని ఈ భౌతిక స్వార్థ ప్రపంచానికి స్వస్తిచెప్పి మరో నూతన ప్రపంచాన్ని సృష్టిస్తేగాని, సామాన్య ప్రజానీకానికి ముక్తి కలగదని సుప్రీం కోర్టు మాజీ న్యాయమూర్తి జస్టిస్ కృష్ణయ్యర్ అన్నారు.

న్యాయశాస్త్ర కోవిదులు, ఆధ్యాత్మిక వేత్తల జాతీయ సమావేశంలో శనివారంనాడు జస్టిస్ కృష్ణయ్యర్ మాట్లాడుతూ పైవిధంగా అన్నారు.

అధికారం అంతా తన చెప్పు చేతల్లో ఉండాలని అధికారాన్ని దుర్వినియోగం చేస్తూ రాజకీయ నాయకులు స్వార్థ పరత్వాన్ని అలవరచుకుంటున్నారని, లిటిగేషన్ పెరగాలని ఎక్కువ ఆదాయాన్ని సంపాదించాలని న్యాయవాదులు తాపత్రయ పడుతున్నారని, రోగుల ఆరోగ్యం కంటేవ్యాధుల పట్లే డాక్టర్లు మక్కువ చూపుతున్నారని జస్టిస్ కృష్ణయ్యర్ అన్నారు.

మరో ప్రపంచాన్ని సృష్టించడం పట్ల ప్రతి ఒక్కడు ఒక విధమైన ఆలోచనా సరళిని కలిగి ఉన్నారని, స్వార్థచింతన లేని వ్యవస్థలు మాత్రం ఏ మీ కనిపించడంలేదని ఆయన అన్నారు.

న్యాయ వ్యవస్థలో పని చేస్తున్న మేజిస్ట్రేట్లు సబ్‌జడ్జీలు కావాలని, ప్రతి కేడర్ ప్రమోషన్లను ఆశిస్తారని రిటైరయిన జడ్జీలు కూడా ఏదో ఒక కమీషన్‌కు చైర్మన్లు అవ్వాలనే ఆలోచనలో ఉంటారని ప్రస్తుతం ఈ విధమైన ధోరణితో ప్రపంచం ఉన్నదని ఆయన అన్నారు.

అగ్రరాజ్యాలు రెండూ ఒకదానిపై మరొకటి ఆధిపత్యం చెలాయించాలని మారణాయుధాల పోటీకి ఎగబడుతున్నాయని ఆయన అన్నారు.

ప్రపంచంలోనే విలువలు, తృప్తి, శాంతి కొరవడినవని, ఈ పరిస్థితుల్లో మనం ఎంతవరకు ప్రగతిని సాధించామనేదానిపై దృష్టిని సారించాలని ఆయన అన్నారు.

రాష్ట్రాల మధ్య వివాదాలు, దేశాల మధ్య సంఘర్షణలు నెలకొని ఉన్నాయని, ఇటువంటి పరస్థితినిఎవరు సృష్టిస్తున్నారనేది కూడాపరిశీలించాలనిఆయన అన్నారు.

వ్యక్తుల మధ్య, వ్యవస్థల మధ్య సహకారం అవగాహన పెంపొందుటకు ఆధ్యాత్మిక అభివృద్ధి అవసరమని ఆయన అన్నారు.

ఈ సమావేశాన్ని ప్రారంభించిన రాష్ట్ర ఆర్థిక శాఖ మంత్రి శ్రీ పి. మహేంద్రనాధ్ మాట్లాడుతూ ప్రస్తుత ప్రపంచంలో శాంతిని గురించి ఆలోచించే వారు తక్కువగా ఉన్నారని, హింస పెరిగిందని ఈ పరిస్థితులను మార్చేందుకు న్యాయవేత్తలు, ఆధ్యాత్మిక వేత్తలు చొరవతీసుకోవాలని అన్నారు.

విశ్వశాంతికోసం బ్రహ్మకుమారి ఈశ్వరీ విశ్వవిద్యాలయం చేస్తున్న కృషిని మంత్రి అభినందించారు.

ఈ సంస్థ కొత్త ప్రపంచంకోసం చేపట్టిన ఉద్యమానికి రాష్ట్రప్రభుత్వం తగిన సహాయ సహకారాలు అందిస్తుందని ఆయన తెలిపారు.

# హైదరాబాద్‌పబ్లిక్‌స్కూల్ సంగతేమిటి?

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)
హైదరాబాద్, డిసెంబర్ 24:

హైదరాబాద్ పబ్లిక్ స్కూల్ యాజమాన్యం పాల్పడుతున్న అనేక అవకతవకలపై ఉన్నత స్థాయిలో విచారణ జరపాలని విద్యాశాఖ మాజీ మంత్రి శ్రీ కె. కేశవరావు రాష్ట్రప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు.

శుక్రవారం నాడిక్కడ జరిగిన పత్రికా విలేఖరుల సమావేశంలో శ్రీ కేశవరావు మాట్లాడుతూ పై విద్యా సంస్థ యాజమాన్యం ఒక పథకం ప్రకారం పెద్దఎత్తున డబ్బు స్వాహా చేస్తోందని ఆయన ఆరోపించారు.

హైదరాబాద్ పబ్లిక్ స్కూల్ సొసైటీకి గత ప్రభుత్వం కొన్ని కోట్లరూపాయలు విలువచేసే ధవళాల, సుమారు 180 ఎకరాల స్థలంతో పాటు అప్పగించిందని, అయితేఆ180 ఎకరాల స్థలం క్రమేపీ తగ్గిందని, ప్రస్తుతం ఆ స్థలాలు ఏమయినాయో తెలుసుకునేందుకు దర్యాప్తు జరపాలని ఆయన డిమాండ్ చేశారు.

ఈ కుంభకోణంలో కొందరు 'ప్రముఖుల' హస్తం వుందని శ్రీ కేశవరావు ఆరోపించారు.

1971లో ఈ పబ్లిక్ స్కూలు రామంతపూర్‌లో తన శాఖ ప్రారంభించడానికి ఉస్మానియా యూనివర్సిటీ నుండి 40ఎకరాల స్థలాన్ని, రు. 54 లక్షల ప్రభుత్వ ఋణాన్ని పొందిందని పైస్థలాన్ని 99 సంవత్సరాల లీజుకు తీసుకుందని ఆయన తెలిపారు, ఈ ఋణానికి ప్రభుత్వం వడ్డీకూడా వేయ లేదని ఆయన అన్నారు.

అయితే ఈ బ్రాంచిని కొద్దిరోజులకే మూసేశారని ఆయన తెలిపారు. కనుక ప్రభుత్వం వెంటనే ఈ యాజమాన్యాన్ని రద్దు చేసి పాఠశాలను తన అధీనంలోకి తీసుకోవాలని ఆయన డిమాండ్ చేశారు.

ఈ స్కూలులో అడ్మిషన్లు జరిగే సమయంలో యాజమాన్యం పెద్ద ఎత్తున డొనేషన్లు వసూలు చేస్తోందని. అయినా అక్కడ పని చేసే టీచర్లలో 70 శాతం మందికి ఏర మొత్తంగా రు. 800 లేదా రు. 1000లు మాత్రమే ఇస్తోందని ప్రభుత్వం ఈ విషయాన్ని పరిశీలించి వి.బి.ఎస్.ని స్కేళ్ళను ఈ స్కూలు టీచర్లకు వర్తింప జేయాలని శ్రీ కేశవరావు డిమాండ్ చేశారు. ప్రభుత్వం 1971 నుండి83 వరకుఈస్కూలుకు రు. 1.5 కోట్లు గ్రాంటు ఇచ్చిందని, ప్రతిఏడు రు. 1 లక్ష గ్రాంట్-ఇన్-ఎయిడ్ క్రింద స్కాలర్‌షిప్‌ల క్రింద రు 2 లక్షలు ఇస్తోందని ఆయన తెలియజేశారు.

ప్రభుత్వం ఇదే విధంగా అన్ని ప్రైవేటు పాఠశాలలకు గ్రాంట్లు ఇస్తోందా అసలు ఈ పాఠశాలల్లో రిజర్వేషన్లు అమలు జరుగుతున్నాయా అని కూడా శ్రీ కేశవరావు ప్రశ్నించారు.

# జోరుగా,హుషారుగా సాగిపోతూనే ఉన్న వ్యభిచారం

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)
హైదరాబాదు, డిసెంబరు 24:

జంటనగరాలలోని మెహబూబ్ కి మెహంది, గోపాలపురం, చార్మినార్, సైఫాబాదు, ఆబిడ్స్, కోఠి, విద్యానగర్, నారాయణగూడా, కాచిగూడా ప్రాంతాలలో, ఈ సంవత్సరం జనవరి నుంచి డిసెంబరు వరకు 632 మంది వ్యభిచారులను అరెస్టు చేశామని టాస్క్‌ఫోర్సు అదిషనల్ డిప్యూటీ పోలీసు కమీషనర్ శ్రీ పున్నారావు తెలిపారు. సాయంకాలం సమయాలలో విటులను ఆకర్షించేందుకు రకరకాల దుస్తులు ధరించి, అర్థ నగ్నంగా తమ అందచందాలంపవయ్యారాలను వలక బోస్తూ సమాజంలోని యువతను చెడ కొట్టే వేశ్యలను ఎన్నిసార్లు అరెస్టు చేసినా వారు తిరిగి మరుసటి రోజున మకాం మార్చివేరే ప్రాంతంలో కొత్త దుకాణం పెడుతున్నారని ఆయన తెలిపారు.

అయితే 1987లోవ్యభిచారులయింత సంఖ్యలో లేరనిఅప్పుడు432 మందిని అరెస్టు చేశామని.1986 243 మందిని అరెస్టు చేశామని, ఆయన అన్నారు.

జంట నగరాలలో వేశ్యా గృహాలు నడుపుతున్న44మందివేశ్యలనువ్యభిచరిస్తున్న విటులను అదుపులోకి తీసుకున్నామని ఆయన తెలిపారు.

# యువతి కిడ్నాప్: తండ్రి ఆందోళన

కూరగాయలు తెచ్చేందుకని మూడు రోజుల క్రితం ఇంట్లోంచి బయటకు వెళ్ళిన తన 19 ఏళ్ళ కూతురుని ఎవరో కిడ్నాప్ చేసి వుంటారని శ్రీ కె. సుబ్రమణ్యం అనే వ్యక్తి సైదాబాదు పోలీసులకు ఫిర్యాదులో పేర్కొన్నారు.

ఇంటర్ చదువుతున్న జనకారాణి ఈ నెల 20వ తేదీ మధ్యాహ్నం కూరగాయల కోసం ఇంట్లోంచి బయటకు వెళ్ళింది, అలా వెళ్ళిన ఆమె తిరిగి రాకపోవడంతో తల్లితండ్రులు కంగారుపడ్డారు.అందంగా వున్న ఆమెను ఎవరైనా కిడ్నాప్‌చేసి ఎత్తుకపోయారేమోనన్నభయంతో పోలీసులకు ఫిర్యాదు చేశారు. సైదాబాదు పోలీసులు కేసు దర్యాప్తు చేస్తున్నారు.

# నగరంలో నేరాలు

## పోకిరీల అరెస్టు

బస్టాండులలో, రైల్వేస్టేషన్లలో పార్కులలో,కాలేజీలవద్ద అమ్మాయిలను వెంటాడి వేధించుకుతినే 1271మంది పోకిరీలను ఈ ఏడాదిజనవరిమొదలుకొని డిసెంబర్‌వరకు అరెస్టుచేశామని టాస్క్‌ఫోర్సు అధినేత తెలిపారు, అయితే గత సంవత్సరం1070మంది పోకిరీలను, 1986లో 192 మంది పోకిరీలను అరెస్టు చేశామని ఆయనఅన్నారు. వీరు ఎక్కువగా సుల్తాన్‌బజార్,ఇందిరా పార్కు, సంజీవయ్య పార్కు, పబ్లిక్ గార్డెన్స్, కోఠి, ఆబిడ్స్, సికింద్రాబాదు రైల్వే స్టేషను, నాంపల్లి బస్టాప్ మొదలైన ప్రాంతాలలో సంచరిస్తుంటారని ఆయన చెప్పారు.

షంషీర్‌గంజి ప్రాంతంలో బుధవారం సాయంత్రం మూడుగంటలకు రోడ్డు ప్రమాదానికి గురైన నాలుగేళ్ళ షాజహాన్ బేగం అక్కడికక్కడే మరణించింది. పోలీసులు చెప్పిన వివరాలప్రకారం నిన్న సాయంత్రం ఒక అంబాసిడర్‌కారు రోడ్డుమీదనుంచి నడచి వెళ్తున్న బేగంను ఢీకొంది. డ్రయివరు పారిపోయాడు, ఆ సంఘటన దరిమిలా ఈ రోజు ఆ ప్రాంతంలోని దుకాణాలన్నింటిని మూసివేశారు. షంషీర్‌గంజి పోలీసు ఇన్స్‌పెక్టర్ శ్రీ రాజ్‌మహమ్మద్ కేసు దర్యాప్తు చేస్తున్నారు.

నగరంలో గురువారం రాత్రి నాలుగు చోరీలు జరిగాయి, సికింద్రాబాదు రైల్వేస్టేషను ప్రాంతంలోని బొంబాయి టైయిలర్స్ బట్టల దుకాణంలో దొంగలుపడి రు. 4000 విలువచేసే బట్టలు రూ 2,593 నగదు ఎత్తుకపోయారు. దుకాణం యజమాని శ్రీ కరీమ్ ఫిర్యాదు మేరకు గోపాలపురం పోలీసు ఇన్స్‌పెక్టరు శ్రీ సి. జయరాంరెడ్డి కేసు దర్యాప్తు చేస్తున్నారు.

ఇదే ప్రాంతంలోని బస్టాప్ లో నెం. 107 ఎ. బస్సు నుంచి దిగుతున్న శ్రీమతి వెంకటరత్నం మెడలోంచి బంగారు గొలుసును ఎవరో తెంపుకున్నారు, గొలుసు విలువ రూ 4000 అని తెలిసింది. గోపాలపురం పోలీసులు కేసు దర్యాప్తు చేస్తున్నారు.

పంజాగుట్ట ప్రాంతంలోని ఎర్రమంజిల్ కాలనీలో శ్రీ చంద్రశేఖర రెడ్డి నిలిపి వుంచిన కారులోంచి రూ. 2000 విలువచేసే ఉపురికాగితం రూ. 2,500 విలువచేసే కెసెట్లు ఎవరో ఎత్తుకు పోయారు. పోలీసులు కేసు దర్యాప్తు చేస్తున్నారు.

హుమాయున్‌నగర్ ప్రాంతంలోని వి. ఎన్. కాలనీలో సి.హెచ్.బి.ఎన్ రాజు యింట్లో దొంగలు పడి టేపు రికార్డరును ఎత్తుకుపోయారు.

# స్కూళ్ళఒప్పందం రద్దు

దేనినో నమ్ముకుని ఒకరు ఏట్లో దిగాడట! ఢిల్లీలో వున్నప్రైవేటు స్కూళ్ళప్రిన్సిపాళ్ళసంగతి అట్లానే అయింది, తాము నమ్ముకున్న ఢిల్లీ రవాణా సంస్థ (డిటిసి) తమను అమాంతం ముంచుతుందనివారనుకోలేదు.

ఢిల్లీలో వున్న చిన్నా, పెద్దా స్కూళ్ళకన్నింటికి వారి స్కూలు పిల్లల్ని తీసుకు వచ్చేందుకు సొంత వాహనాలులేవు.డి.టి.సి.వారిబస్సులు మాత్రమే స్కూలు పిల్లల్ని ఇప్పటి వరకుచేరవేస్తూవస్తున్నాయి. 20ఏళ్ళ ఒప్పందం క్రింద స్కూలు ప్రిన్సిపాళ్ళు డి.టి.సి.కినెలకు సంవత్సరానికి కొంత డబ్బు కడుతుండేవారు.

అయితేఇటీవల డి.టి.సి.ఒక తాఖీదును అన్ని స్కూళ్ల ప్రిన్సిపాళ్లకు రవాణా సంస్థల పంపుతూ, ఒప్పందం క్రింద డి.టి.సి.స్కూలు పిల్లల రవాణాకు అనుమతి ఇప్పటి వరకు పొందుకోలేదని, కనుకఇకపైస్కూలు పిల్లల రవాణాకు తాము బస్సులు సమకూర్చ లేమని డి.టి.సి. చేతులు దులిపేసుకుంది.

దీంతో ఆ స్కూలు ప్రిన్సిపాళ్ళు సొంత వాహనాల కొనుగోలు కోసం గందరగోళపడుతున్నారు.

# బేబీసూపర్ మార్కెట్: లిటిల్‌కింగ్‌డమ్

హైదరాబాదు, డిశంబర్ 24:

పొత్తిళ్లలో పిల్లల నుంచి 10ఏండ్ల వరకు ఎదిగిన బాలబాలికలకు కావలసిన దుస్తులైతేనేం. ఆట వస్తువులైతేనేం చెప్పులు, పుస్తకాలు, ఫర్నిచర్ ఇంకా ఇంకా అవసరాలు తీర్చే అనేక వస్తువులన్న ఒకేచోట దొరికే దుకాణం పేరే 'లిటిల్‌కింగ్‌డమ్' ఇది పిల్లల సూపర్ మార్కెట్.

ఇలాంటి 'బాల సామ్రాజ్యాలు' కొచ్చిన్, జయపూర్, బెంగుళూరు, మద్రాసుల్లో ఈవరకే తెరిచారు.

ఇప్పుడు హైదరాబాదుకి అదృష్టం పండింది.

మదర్‌కేర్ ఆఫ్ ఇండియా అనే వ్యాపార సంస్థలు వీటినినడుపుతోంది. ఇటువంటి స్టోర్స్‌తెరవాలనే సంకల్పం ప్రముఖ పారిశ్రామికవేత్త శ్రీ పి. [illegible] కలిగించింది. శ్రీ ఆర్.కె. సంస్థ శిరప్రధానుడు.

# తిండిపోతు కాదు

ఎప్పుడుపడితే అప్పుడు దొరికింది తినడం కొందరికి అలవాటు, వారికి నోరు ఎప్పుడూ గానుగలా ఆడవలసిందే. ఇటువంటి వాళ్ళను చూసే "పందిలా ఏమిటాతిండి" అని ఎగతాళి చేస్తుంటాం.నిజానికి పంది మనుషుల్లా తిండిపోతు కాదట.

తిండికి ఎప్పుడుఫుల్‌స్టాప్‌పెట్టాలో తెలియజేస్తే నాడీవ్యవస్థ ఈ జంతువులో బాగా పనిచేస్తుందట. అందువల్ల చాలినంత ఆహారం తినగానే, "తిన్నది చాలు, ఇక మానేయ్" అంటూ మెదడుకు ఒక సంకేతం వస్తుంది. అంతే. పందులుతినడం మానేస్తాయి. మళ్ళీ ఆకలయితేనే ఆహారంకోసం వేట.

మనిషి అలాకాదు. కొందరికి ఆకలంటేనే తెలియదు. రుచిగల పదార్థాలు కనిపిస్తే చాలు, లేని ఆకలి పుట్టుకొస్తుంది. మనిషికికూడా "తిన్నది చాలు" అనే సంకేతాలు వస్తే బాగుంటుంది. ఒకవేళ వచ్చినా లక్ష్యపెడతాడా!

# ప్రపంచ ప్రఖ్యాతిచెందిన "ఐరిసెస్" పెయింటింగ్

ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన చిత్రకారుడు శ్రీ వెన్‌గోమ్ చిత్రించిన "ఐరిసెస్" అనే మహత్తరమైన పెయింటింగ్‌ను తాను కొనుగోలు చేసినట్లు శ్రీ ఎలెన్ బాండ్ తెలిపారు. 1889లో ఈ "ఐరిసెస్" చిత్రాన్ని శ్రీ గోఘ్ చిత్రించారు.

1987లో న్యూయార్క్‌లోని నాత్ బైస్ వేలంపాటలో తాను ఈ చిత్రాన్ని 53.9 మిలియన్ డాలర్లకు కొనుగోలు చేశానని, అయితే ఈ విషయాన్ని ఒక ఏడాది పాటు రహస్యంగా ఉంచానని శ్రీ బాండ్ అన్నారు.

# సరిహద్దుపై రహస్య ఒప్పందమేమీలేదు

న్యూఢిల్లీ, డిశంబర్ 24 : సరిహద్దు సమస్యపై చైనాతో రహస్య ఒప్పందం ఏమీ చేసుకోలేదని ప్రధాని శ్రీ రాజీవ్ గాంధీ స్పష్టం చేశారు.

చైనా పర్యటన నుండి తిరిగి వచ్చిన వెంటనే విమానాశ్రయంలో విలేఖరుల ప్రశ్నలకు సమాధానమిస్తూ చైనా నాయకులతో రహస్య అవగాహన కుదిరిందన దాన్ని ప్రధాని తీవ్రంగా ఖండించారు. అది పూర్తిగా తప్పు అన్నారు.

చైనానాయకులతో ఇష్టాగోష్టిలో కుది రిన ఒప్పందాన్ని సంయుక్త కార్య బృందం బహిరంగ పరుస్తుందా అని విలేఖరులు అడిగారు. భారత, చైనాల పరస్పర వైఖరులు తెలుసు, మన వైఖరులు తెలియడంతోనే ముందుకు పోవాలను గనుక ముందుకు పోవడానికి సంయుక్త కార్య బృందము అవసర పని చెప్పాము. ఉభయ దేశాలకు ఆమోదయోగ్యమైన, న్యాయమైన సహేతుకమైన పరిష్కారం కోసం సంయుక్త కార్య బృందం పనిచేస్తుంది.

చైనా సందర్శనపై మీ మదింపు ఏమిటని చైనా జర్నలిస్టు ఒకరు అడుగగా ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ చైనా నాయకులకు అభివందనములు తెలిపారు. చైనా నాయకులతో చర్చలు చాలా బాగా జరిగా యన్నారు.

తమ చైనా సందర్శన రెండు దేశా లకు నూతనాధ్యాయమని విశ్వసిస్తున్నా మన్నారు కార్యబృందంలో ఉభయ దేశాల వారు వున్నారని అధికార స్థాయిలో జరి గిన 8సమావేశాలను దృష్టిలో పెట్టుకొని గంద్రగోళపడరాదని శ్రీ రాజీవ్‌గాంధీ అన్నారు.

కార్యబృందానికి నిర్దిష్టమైన ఆజ్ఞ వుంది. ఉన్నతస్థాయిలో పరస్పరం రాజ కీయాభిప్రాయాలు వెల్లడించుకున్న దరి మిలా కార్య బృందం సమావేశమవు తుంది. ఇది ఫలితాలనిస్తుందనుకుంటా న్నాము.

పని చేసేందుకు సంబంధించిన నిబం ధనలను రూపొందించుకోవలసిందిగాను, స్వయంగా కాలవ్యవధిని నిర్ణయించుకోవ లసిందిగాను ఉభయ దేశాల సంయుక్త బృందాన్ని కోరాయి. మొదట కొన్ని సమా వేశాలు జరిగేవరకు కాలవ్యవధిని నిర్ణయిం చరాదని ఆయన అంగీకరించారు. అంతవ్యవధి అంటూ సూచించనూ లేదు, అంగీకరించనూ లేదని శ్రీ రాజీవ్ గాంధీ అన్నారు. అయితే ఎంతకాలం పడుతుం దనే విషయంలో ఉజ్జాయింపుగా ఒకఅభి ప్రాయానికి వద్దాము అన్నారు.

సరిహద్దున శాంతి సామరస్యాలు వుండేట్లు సంయుక్త కార్యబృందం చూస్తుం దని అంటే ఏ పైనా సమస్యగాని ఉద్రిక్తత గానితలెత్తితే దానిని ఈ బృందం నివారి స్తుందని ఆయన చెప్పారు.

అంతకుముందు ఆయన ప్రయాణం చేసిన సముద్రగుప్త విమానంలో విలేకరు లతో మాట్లాడుతూ క్రింది విషయాలు చెప్పారు.

సార్క్ సమావేశానికి హాజరయ్యేందుకు ఇస్లామాబాద్ వెళ్ళినప్పుడు పాకిస్తాన్ ప్రధాని శ్రీమతి బెనజీర్ భుట్టోతో ఆ దేశపు అణుశక్తి కార్యక్రమాన్నిగురించి చర్చిస్తాను.

పాకిస్తాన్‌కు అణ్వస్త్ర కార్యక్రమం లేదని శ్రీమతి బెనజీర్ భుట్టో చేసిన ప్రకటనను శంకించవలసిన కారణం కనిపించడం లేదు. అయితే ఈ కార్యక్రమం విషయంలో పాకిస్తాన్ చాలా పురోగామి దశలో వుందని వివిధ వర్గాల నుండి సమాచారము అందింది.

పంజాబ్‌లో తీవ్రవాద కార్యకలాపా లలో పాకిస్తాన్‌కు ప్రమేయంకల్పించాలను కోవడంలేదని శ్రీమతి బెనజీర్ అన్నారు. ఈ సమస్యపై కూడా ఆమెతో మాట్లాడు తాను. పాకిస్తానీశక్తుల ప్రేరణతో కాశ్మీర్‌లో పెచ్చరిల్లిన తీవ్రవాద కార్యకలాపాల గురించి కూడా చర్చిస్తాను. శ్రీమతి బెన జీర్‌తో సమావేశానికి ఎదురు చూస్తు న్నాను.

సిమ్లా ఒప్పందం ప్రాతిపదికనఉభయ దేశాల మధ్య చాలా సమస్యలను పరి ష్కరించు కోవచ్చు.

సార్క్ సమావేశానంతరం పాకి స్తాన్‌లో ఎంతసేపుండే విషయం చెప్ప జాలను. ధిల్లీలో తమిళనాడు, నాగా లాండ్, మిజోరం ఎన్నికలదృష్ట్యా నాపై చాలావత్తిడివుంది. గనుక పాకిస్తాన్‌లో ఎంతసేపు ఉండగలనో తెలియదు. చర్చ నీయాంశాలు చాలావున్నాయి.

పాకిస్తాన్‌లోని నూతన ప్రభుత్వంతో మంచి అవగాహనను తీసుకోగలనని ఆశిస్తున్నారు.

కాశ్మీర్ సమస్యను గురించికూడా శ్రీమతి బెనజీర్‌తో చర్చిస్తాను ఇస్లామా బాద్‌లో శ్రీలంక నూతన అధ్యక్షుడు శ్రీ ప్రేమదాసను కలిసినప్పుడు శ్రీలంకలో భారత శాంతిదళం భవిష్యత్‌ను గురించి మాట్లాడుతాను. ఎల్.టి.టి.ఇ.వారు ఆ దేశ ప్రధాన రాజకీయజీవిత ప్రవంతిలో చేరా లని కోరుతున్నాను. అక్కడి ప్రజలు దౌర్జన్య కాండను వ్యతిరేకిస్తున్నారని శాంతిని అధికార వికేంద్రీకరణను కోరు తున్నారని ఉత్తర తూర్పు రాష్ట్ర మండ లాల ఎన్నికలు రుజువు చేశాయన్నారు.

సినిమా రంజని చదవండి





## హైకోర్టులో రిట్

మద్రాస్, డిశంబర్ 24 : జనవరి 21న తమిళనాడులో జరగనున్న ఎన్నికల సందర్భంగా ఏ పార్టీకి కూడా ప్రత్యేకమైన ప్రాముఖ్యత నీయకుండా, ఎన్నికలలో పోటీచేసే గుర్తింపబడిన రాజకీయ పక్షాలన్నిటికి సమాన అవకాశాలు ఇవ్వాలని, భారత ప్రభుత్వ సమాచార, ప్రసార శాఖ మంత్రిత్వశాఖకు దూర దర్శన్ డైరెక్టరుకు ఆదేశాలు ఈయవల సిందిగా కోరుతూ మద్రాస్ హైకోర్టులో ఒక రిట్ పిటిషన్ దాఖలైంది.





# శ్రీ స్వామి సుందర చైతన్యానంద

నిడదవోలు, డిశంబర్ 24 : తూర్పు గోదావరిజిల్లా ధవళేశ్వరంలో 1984లో సుందర చైతన్యాశ్రమం స్థాపించారు. భక్తులను పునీతులను చేస్తున్న శ్రీ స్వామి చైతన్యానంద 41వ జన్మదినోత్సవం ఖమ్మంలో ఈనెల 25న జరుగనుంది.

శ్రీ స్వామి అతిచిన్న వయస్సులో జిహాసుఖాలను విడనాడి, ఆదిశంకరుని ఆశయసిద్ధికి, స్వామి వివేకానంద కొన సాగించిన హిందూమతోద్ధరణ యజ్ఞము నకు దీక్షబూనారు. రాష్ట్రం నలుమూలలా పర్యటిస్తూ ముఖ్యకేంద్రాలలో ప్రచారం చేస్తున్నారు. ఇప్పటికి 75 గీతాయజ్ఞాలు నిర్వహించారు. తమసహజ మృదుమధుర గంభీరో పన్యాసములతో సదస్యులను సమ్మోహితులనుచేస్తున్నారు. యింతవరకు 75 ఆధ్యాత్మిక గ్రంధాలు రచించారు.

శ్రీ స్వామి 1949 డిశంబరు 25న నెల్లూరు జిల్లా బుచ్చిరెడ్డిపాలెం మండలం లోని కట్టుబడి గ్రామంలో పెరుందబూరు వెంకటశేషాచార్యులు, రంగనాయకమ్మ పుణ్యదంపతులకు 8వ సంతానంగా జన్మిం చారు. వీరి పూర్వులు ద్రవిడ దేశస్తులు, చెంగల్‌పట్టుజిల్లా పెరుందబూరుగ్రామం. వైష్ణవ మత స్థాపకులు శ్రీ రామానుజా చారి జన్మస్థలం కూడా యిదే. తల్లి దండ్రులు సుందరరాజన్‌గా నామకరణం చేశారు.

సుందరరాజన్ చిన్నతనం నుండి తలి దండ్రులతో అన్ని ఆచారాలలోనూ పాల్గొనేది వారు. వీలుచిక్కినప్పుడల్లా వరదరాజస్వామి ఆలయమును శుద్ధి శ్రమ చేస్తుండేవాడు. కళాశాలలో విద్యనభ్యసించునపుడు కూడా సదాచారం ధర్మములు పాటిస్తూ సహ విద్యార్థులు పేరశకు గురవుతుండేవారు. 1984లో ధవళేశ్వరంలో సుందర చైతన్యాశ్రమం స్థాపించారు. నాటి గవ ర్నరు శ్రీ శంకరదయాళ్‌శర్మ దానికి ప్రారంభోత్సవం చేశారు.

ఆశ్రమంలో అడుగిడిన వ్యక్తి భౌతిక లౌకిక వ్యవహారాలు పూర్తిగా మరచి, ఒక దివ్య అనుభూతిపొందుతాడు. ఆశ్ర మంలో స్థాపించిన వివిధశిల్పాలు,వృక్షాలు కుటీరాలు మైమరపింపజేస్తాయి. అడుగడు గునా హెచ్చరికలుంటాయి. మందహా సంతో శ్రీ స్వామి పలకరింపు ఒకపులక రింపు.

41వ జన్మదిన సందర్భంగా ప్రజా నీకానికి మీరిచ్చే సందేశమేమని ప్రశ్నిం చగా, "నైతిక శిక్షణ కొరవడి దేశంలో శాంతి భద్రతలు క్షీణిస్తున్న యీ తరు ణంలో ఆధ్యాత్మిక చింతన ఒక్కటే మానవ సమాజానికి వెలుగుబాట చూపగల అమరదీపం. అందుకొరకు ఆస్తికులు, భక్తులు ఒక్కచోట చేరవలసిన దివ్య సమయం ఆసన్నమైంది. ఖమ్మంలో జరిగే 41వ జన్మదిన వేడుకలకు హాజ రయ్యే వేలాది భక్తులలోని అంతర్లీనంగా గోచరించే ఆశయమిదే. యీ ఆశయమే లేక కేవలం జన్మదిన సంబరమే అయితే అది నేటి పరిస్థితిలో అవాంఛనీయమే అన్నారు.

ఖమ్మంజిల్లా సత్సంగంవారు యీ వేడుకలను ఖమ్మంలో నిర్వహిస్తు న్నారు. (వి)






Printed and Published for Nageswara Rao, Estates Private Ltd, by S. Nageswara Rao, at the Andhra Patrika Press, 1-2-365/5, Gaganmahal, Domalguda, Hyderabad-29.
Editor : C.V. Rajagopal Rao, [Hyderabad],
Chief Editor: S. Radhakrishna,
Phones: Business: 68092, Editorial: 68037


# బెనజీర్, జరా సోచ్‌కే చల్

ఇస్లామాబాద్, డిశంబర్ 24 : పాకిస్తాన్‌ను అన్నివిధాల పటిష్ట వంతంగా తయారు చేసేందుకు కొత్తగా ఏర్పడిన శ్రీమతి బెనజీర్ ప్రభుత్వం ప్రయత్నాలు ప్రారంభించింది. అయితే ఆమె వ్యవహరిస్తున్నతీరు వివాదాలకు దారి తీస్తోంది.

వివిధ దేశాలలో వున్న తమ రాయబారుల వివరాలను తెలుసుకుని, తద్వారా రాయబారుల వ్యవస్థను పునర్వ్యవస్థీకరించడానికి ఆమె సన్నాహాలు ప్రారంభించింది. అమెరికా, చైనా, బ్రిటన్, అరబ్ దేశాలలో ప్రస్తుతం వుంటున్న పాక్ రాయబారుల వివరాలను ఆమెకోరినట్లు అధికార ప్రతినిధి ఒకరు తెలిపారు, పునర్వ్యవస్థీకరణ వచ్చే ఏడాది జనవరి, ఫిబ్రవరి నెలల్లో జరగవచ్చని ఆ ప్రతినిధి చెప్పారు.

ఇదిలా వుండగా, శ్రీమతి బెనజీర్ తన నివాసాన్ని రావల్పిండిలోని పాత అధ్యక్ష భవనానికి మార్చింది. ఇకపై ఆ భవనాన్ని ప్రధాని నివాస గృహంగా వ్యవహరిస్తారు. ఈ అధికార నివాస గృహాన్ని గతంలో 'ఐవన్ నవాజ్' బిల్డింగ్‌గా వ్యవహరించేవారు. శ్రీమతి బెనజీర్ తండ్రి శ్రీ జుల్ఫికర్ అలీ భుట్టో హయాంలో పాక్ అధ్యక్షుడిగా వున్న శ్రీ ఫజల్ ఇలాహి చౌదరి ఈ భవనాన్ని అధ్యక్షభవనం క్రిందకు మార్చారు.

ఇవన్నీ ఎలావున్నా, కేంద్రప్రభుత్వా నికి, ఇతర రాష్ట్రాల మధ్య తలెత్తిన కొన్ని విభేదాలను తొలగించుకోడానికి శ్రీమతి బెనజీర్ ప్రయత్నిస్తోంది, అయి నప్పటికీ అవి సమసిపోవడం లేదు. రాష్ట్రప్రభుత్వ సీనియర్ అధికారులను, ప్రధాన కార్యదర్శిని తొలగించడంతో ఆ రాష్ట్రానికి, కేంద్రానికిమధ్య విభే దాలు పొడసూపాయి. అక్కడవున్న మిశ్రమ ప్రభుత్వం సంకట స్థితిలోపడి, ఆటు తరువాత రద్దుకు దారితీసింది. సీనియర్ అధికారులను కేంద్రం తొల గించడంద్వారా పంజాబ్‌ను సంక్షోభానికి గురిచేసి, ఎలాగైనా అధికారంలోకి రావాలని పి.పి.పి. ప్రయత్నిస్తోందని ఆ రాష్ట్రంలోని ప్రతిపక్ష పార్టీలు విమ ర్శించాయి. మిశ్రమ ప్రభుత్వం అను మతిలేకుండా, కేంద్రమే నేరుగా అధి కారులబదిలీలకు,తొలగింపుకుఉత్తర్వులు జారీ చేయరాదని ఆ పార్టీలు పేర్కొ న్నాయి. దీంతో అక్కడ మిశ్రమ ప్రభుత్వం కూడా రద్దుకు రెండురోజుల ముందు ఒక ఉత్తర్వును జారీ చేస్తూ సీనియర్ అధికారు లెవరూ కేంద్రం పంపిన ఉత్తర్వులను ఖాతరు చేయా ల్సిన పని లేదని, బదిలీలకు సిద్ధం కారాదని కోరింది. మిశ్రమ ప్రభుత్వ ఉత్తర్వులు రానిదే ఏ అధికారి తన స్థానాలు వదలి పోరాదని ముఖ్యమంత్రి శ్రీ మియాన్ నవాజ్ షరీఫ్ ఆదేశిం చారు.

రాష్ట్రాల అధికారాలను కాలరాయ డానికి కేంద్రం ప్రయత్నిస్తోందని ప్రతిపక్షాలు విమర్శించాయి.

# ఎన్నికలరంగంలో ఎం.పి.ల రణం

మద్రాసు, డిశంబర్ 24 : తమిళనాడు నుండి ఎన్నికైన అనేక మంది పార్లమెంటుసభ్యులు ఈసారి రాష్ట్ర శాసనసభ ఎన్నికల్లో పోటీచేయా లని నిర్ణయించుకొన్నారు.

ఎఐఎడిఎంకె జయలలిత వర్గానికి చెందిన పార్లమెంటుసభ్యుడు శ్రీ పి. కొళందైవేలు, జానకి వర్గానికి చెందిన శ్రీ అల్లాడిఅరుణపోటీచేస్తున్నట్లుఅప్పుడే ప్రకటించారు. వీరితోపాటు కాంగ్రెస్‌కు చెందిన 15మంది శాసనసభ్యులకు శాసనసభకు పోటీ చేసేందుకు స్థానాలు నిర్ణయించారు.

కాంగ్రెసు అభ్యర్థులలో కేంద్ర పరిశ్రమలశాఖ సహాయ మంత్రి శ్రీ అరుణాచలమ్, శ్రీ వాళప్పాడి కె. రామమూర్తి, శ్రీ తండిపనమ్ కె. రామమూర్తి తదితరులు ఉన్నారు.

కేంద్ర హోంశాఖ సహాయమంత్రి శ్రీ పి.చిదంబరం కూడా అసెంబ్లీ ఎన్ని కల్లో పోటీచేస్తారని తెలుస్తోంది. ఆయన తాను కూడా పోటీచేస్తానని ప్రకటించ నప్పటికీ ఈవిధమైన వార్తలు వెలువడ డం గమనార్హం.

కాంగ్రెస్ రాజ్యసభ సభ్యుడు, టిఎన్‌సిసి అధ్యక్షుడు శ్రీ మూపనార్ శాసనసభకు పోటీచేస్తారనిభావిస్తున్నారు. పార్లమెంటు మాజీ సభ్యుడు నటుడు శ్రీ శివాజీగణేశన్ తంజావూరులోని తిరువయ్యారు అసెంబ్లీ నియోజకవర్గం నుండి పోటీచేస్తున్నారు.

జయలలిత వర్గానికి చెందిన పార్ల మెంట్‌సభ్యులుశ్రీఎస్.కె.టి జనార్దన్, శ్రీ కె. అర్జునన్, శ్రీ ఎ.అశోక్‌రాజ్ తదితరులు కూడా రంగంలో ఉన్నారు.

ఒరులేయవి యొనరించిన నప్రియము తన మనంబునకగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథముల కెల్లన్

# ఆంధ్రపత్రిక

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు : 1938–1972

## వెల్లివిరిసిన సుహృద్భావం

ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ చైనాలో జరిపిన పర్యటన వల్ల ఉభయ దేశాల మధ్య మైత్రీపూర్వకమైన వాతావరణం నెలకొన్నది. ఉభయ దేశాల మధ్య స్నేహ వారధికి పటిష్టమైన పునాది పడింది. చిరకాలంగా వేధిస్తున్న సరిహద్దు పేచీ పరిష్కార దిశగా వాస్తవమైన కృషికి అంకురార్పణ జరిగింది. అందుచేత శ్రీ రాజీవ్‌గాంధీ పర్యటన ఫలప్రదమైనది. శుభప్రదమైనది. ఇప్పటికి ఇంచుమించు ఆరు సంవత్సరాలుగా రెండు దేశాలు పరస్పరం ఆరోపించుకుంటూ, అనుమానించుకొంటూ మనుగడ సాగించాయి. గత కొద్ది సంవత్సరాలుగా చేరువ కావడానికి ప్రయత్నాలు ప్రారంభమైనా అవి క్రియాశూన్యంగానే మిగిలిపోయాయి. అధికారుల స్థాయిలో సంభాషణలు వ్యవహారాన్ని ముందుకు నడిపించలేక పోయాయి. ఇప్పుడు ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ చైనాలో జరిపిన పర్యటన వల్ల ఒక నూతన సుహృద్భావ వాతావరణం ఆవిష్కృతమైంది. చైనా అధినేత డెంగ్ జియావో పింగ్‌తో శ్రీ రాజీవ్‌గాంధీ జరిపిన చర్చలు ఉభయ దేశాల మధ్య సంబంధాలలో నవశకం ఆరంభం తిపుతున్నదనే విశ్వాసాన్ని కలిగించాయి. మావో తర్వాత మళ్లీ అంతటి నాయకుడుగా చైనాకు సారథ్యం వహిస్తున్న వృద్ధ నాయకుడు చైర్మెన్ డెంగ్ "వెల్‌కం మై డియర్ యంగ్ ఫ్రెండ్" అంటూ ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధిని సస్నేహంగా ఆహ్వానించి అరమరికలు లేకుండా చర్చలు జరిపారు.

శ్రీ రాజీవ్‌గాంధీ చైనాలో అయిదు రోజుల పాటు జరిపిన పర్యటనలో చైనా అధినేత డెంగ్‌తోనూ, ప్రధాని లీ–పెంగ్‌తోనూ, దేశాధ్యక్షుడు యాంగ్‌తోనూ, పార్టీ ప్రధాన కార్యదర్శి చావో జియాంగ్‌తోనూ, ఉపప్రధాని వూ తోను చర్చలు జరిపారు. ఈ అయిదుగురు అగ్ర నాయకులతో రాజీవ్ జరిపిన చర్చలలో సరిహద్దు సమస్య పరిష్కారానికి వినూత్న దృక్పథంతో కృషి జరగాలన్న ఆకాంక్ష వెల్లడైంది. ఇచ్చిపుచ్చుకొనే పద్ధతిలో సరిహద్దు పేచీని కడతేర్చాలనే స్పృహ చైనా నాయకులలో కలిగినట్టు కనిపిస్తున్నది. సరిహద్దుపై పంతాలు, పట్టింపుల కంటే భారతదేశంతో మైత్రీ పునరుద్ధరణకే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తున్న సూచన వారి మాటల్లో, వారి ప్రవర్తనలో వ్యక్తమయింది. మూడు దశాబ్దాల తర్వాత భారత ప్రధాని చైనా సందర్శనకు రావడమే ఒక గొప్ప చారిత్రికమైన మలుపుగా చైనా నాయకులు అభివర్ణించారు. చేదు గతాన్ని మరచిపోదాం చెలిమి బాటలో కలిసి నడుద్దాం అని డెంగ్ అన్న మాటలు భారత – చైనా సంబంధాలలో స్వర్ణ యుగానికి బాటలు పరుస్తాయని ఆశించవచ్చు.

సరిహద్దు పరిష్కారం కోసం నియమించిన ఉభయదేశాల సంయుక్త బృందం గతంలో ఎనిమిదిసార్లు అధికారుల స్థాయిలో జరిగిన వ్యర్థ కృషికి భిన్నమైన, ఫలప్రదమైన పాటు పడగలదని ఆశించవచ్చు. ఒకరి భూభాగాన్ని వేరొకరు దురాక్రమించారనే దృష్టితో కాకుండా ఏవిధంగానైనా ఏకీభావానికి రావాలనే దృష్టితో కొంత ఇచ్చి కొంత పుచ్చుకొనే సద్భావంతో నూతనమైన కృషి ఆరంభమౌతుందని ఆశించవచ్చు.

రెండు దేశాల మధ్య తిరిగి విమానయాన సర్వీసులు ప్రారంభించడం, శాస్త్ర, సాంకేతిక రంగాలలో సహకారం, సాంస్కృతిక బృందాలను ఇచ్చి పుచ్చుకోవడంపై మూడు ఒప్పందాలు ఈ పర్యటనలో కుదిరాయి. రెండు దేశాల ప్రజలను మరింత సన్నిహితం చేయడానికి ఇవి ఉపయోగపడతాయి.

చైనా ప్రధాని లీపెంగ్ భారత దేశంలో పర్యటించడానికి అంగీకరించారు. తేదీ నిర్ణయం కావలసి ఉంది. లీపెంగ్ భారత సందర్శనకు వచ్చేటప్పటికి సరిహద్దు సమస్యపై ఉభయదేశాల మధ్య మరింత సదవగాహన ఏర్పడుతుందని సిసలైన కార్యరంగంలోకి అడుగు పెట్టడం జరుగుతుందని ఆశిద్దాము.

## అమానుషం

ప్రమాదాలు సహజం. దుర్మరణాలూ సహజం. భూ, ఆకాశ, జల మార్గాలలో ప్రయాణాలు అప్పుడప్పుడూ ప్రమాదాలకు గురి కావడం అత్యంత సహజం. అయితే తమ దారిన తాము ప్రయాణం చేస్తున్న అమాయకులను అకాల మృత్యువు నోట్లోకి నెట్టి వేసే విద్రోహ చర్యలే బాధాకరమైనవి. అమానుషమైనవి. బ్రిటన్‌లో బుధవారంనాడు సంభవించిన ఘోర విమాన ప్రమాదం విద్రోహం వల్ల సంభవించినదేనన్న వార్త గుండెలను కలచివేస్తుంది. మానవతకు హేయమైన మచ్చగా మిగిలి పోతుంది.

ఫ్రాంక్‌ఫర్ట్‌లో బయలుదేరి న్యూయార్క్ వెడుతున్న ఈ విమానం లండన్‌లో ఆగి మళ్లీ ప్రయాణమైన తర్వాత అర్ధ గంటకు స్కాట్‌లాండ్‌లోని ఒక పట్టణం మీదుగా వెళుతుండగా, గాలిలోనే భగ్నమై మండిపోయింది. ఈ విమాన శకలాలు పడిన మేర నేలపై జ్వాలలు రగిలి పది, పన్నెండు మంది మరణించారని కూడా వార్తలు వచ్చాయి. ఈ ప్రమాదంతో విమానంలో ప్రయాణిస్తున్న మొత్తం 260 మందీ మరణించారు.

ఈ విమానాన్ని టెర్రరిస్టులే పేల్చి వేసి ఉంటారని నిపుణులు గాఢంగా నమ్ముతున్నారు.

విమానంలో ప్రయాణం చేస్తున్న వారిలో నమీబియా వ్యవహారాలు చూస్తున్న ఐక్యరాజ్యసమితి ఉన్నతాధికారి ఒకరు ఉన్నారు. నమీబియా స్వాతంత్ర్యంపై దక్షిణాఫ్రికా, క్యూబా, అంగోలాల మధ్య త్రైపాక్షిక ఒప్పందంపై సంతకాలు జరిపించే పని మీద ఈయన న్యూయార్క్ వెడుతున్నారు. ఈయనను హతమార్చే ఉద్దేశంతో దక్షిణాఫ్రికాకు చెందిన శ్వేతజాతి గెరిల్లాలు విమానాన్ని పేల్చి వేసి ఉంటారని అనుమానించడం జరిగింది. అలాగే గత జూలై మాసంలో ఇరాన్‌కు చెందిన ఒక ప్రయాణీకుల విమానాన్ని అమెరికా యుద్ధ నౌకలు కూల్చివేసినందుకు ప్రతీకారంగా ఇరానియన్ తీవ్రవాదులు ఈ విమానాన్ని పేల్చి వేసి వుంటారని కూడా భావించడం జరుగుతున్నది. అమాయకులను బలి తీసుకొనే విద్రోహకాండను ప్రపంచమంతా ఏక కంఠంతో ఖండించవలసి వుంది.

# జార్జి బుష్ దారి ఎటు?

అమెరికా అధ్యక్షపదవికి ఎన్నికైన జార్జి బుష్ వచ్చేనెల కిరీటధారణ చేయబోతున్నారు. జార్జిబుష్ ధరించనున్న కిరీటం ముళ్ళకిరీటం కాదుగాని అధ్యక్ష పదవిలో ఆయన నడక నల్లేరుమీద బండిమాత్రం కాబోదు. కాఠిన్యానికి మారుపేరుగా వాసికెక్కినరోనాల్డ్ రీగన్ రెండు పదవీకాలాలపాటు అమెరికాను సమర్థవంతంగా పరిపాలించారు. లిబియామీదకు యుద్ధనౌకలను పంపించినా, నికరాగువా మార్క్సిస్టు ప్రభుత్వాన్ని మట్టి గరిపించుతానని శపథం పూని విఫలమైనా, ఇరాన్‌కు రహస్యంగా ఆయుధాలు విక్రయించిన వ్యవహారంలో అపఖ్యాతిపాలు అయినా అరాఫత్‌ను అమెరికాలో అడుగు పెట్టనివ్వకుండా చేసి ఆ వెంటనే పి ఎల్ ఓతో చర్చలకు సమ్మతించినా ప్రెసిడెంట్ రీగన్ తన ప్రత్యేకపాలనా శైలితో ప్రపంచదృష్టిని ఆకర్షించారు. కొన్ని సందర్భాలలో ప్రపంచ ప్రజాభిప్రాయాన్ని త్రోసిపుచ్చి వ్యవహరించడం ద్వారా యుద్ధోన్మాదిగా, ఆయుధరాకాసి చెలికాడుగా ప్రెసిడెంట్ రీగన్ అపఖ్యాతిపాలయారు. అయితేనేమి సోవియట్ యూనియన్ అధినేత మిహాయిల్ గోర్బచెవ్ వంటి సామరస్యవాదితో కలిసి మధ్యశ్రేణి అణుశిపణుల నిర్మూలన వంటి చరిత్రాత్మకమైన ఒప్పందాలపై సంతకంచేసిన ఘనత రీగన్‌కు దక్కింది.

ప్రెసిడెంట్ రీగన్ ఖాళీచేసినసింహాసనాన్ని అధిరోహిస్తు జార్జి బుష్ అమెరికా ప్రజల మనసులలోను, ప్రపంచం దృష్టిలోను తనదంటూ ఒక ప్రత్యేకమైన ముద్ర వేసుకోవడానికి చాలా కష్ట పడవలసి ఉంటుంది.

జార్జి బుష్ పెద్ద "ఇమేజ్"ఉన్న నాయకుడు కాదు, ఆయన భావాలు, విధానాలు ప్రపంచానికి ఇంకా పూర్తిగా విదితం కాలేదు. అయితే ప్రెసిడెంటు రీగన్‌తో ఎనిమిదేళ్ళు అంతకుముందు నిక్సన్ ఫోర్డు ప్రభుత్వాలలో పనిచేసిన అనుభవం బుష్‌కు అమెరికా దేశాధినేతగా అందరి మన్ననలూ పొందడానికి మంచిపేరు తెచ్చుకొనే కృషిచేయడానికి తోడ్పడతాయని భావించవచ్చు.

ప్రెసిడెంట్ రీగన్ అమెరికా ఆర్థిక రంగానికి పూర్తిగా కాకపోయినా, కొంతవరకైనా స్వస్థతను చేకూర్చారు. నిరుద్యోగం, ద్రవ్యోల్బణం రేటును అదుపులో ఉంచారు. వీటిని కాపాడుకొంటూ అమెరికా ఆర్థికవ్యవస్థ లోటును ఊబిలోనుంచి బయటపడవేయడానికి జార్జి బుష్‌కు పరీక్షవంటిది. అటు బడ్జెట్‌లోటును ఇటు వాణిజ్యలోటును భర్తీ చేయడానికి గట్టి కృషి జరగవలసి ఉంది.

ప్రెసిడెంట్ రీగన్ దిగిపోతూ అమెరికా విదేశాంగ విధానంలో ముఖ్యంగా పశ్చిమాసియాకు సంబంధించి అమెరికా విధానంలో పెనుమార్పును తీసుకువచ్చారు. ఉన్నట్టుండి పాలస్తీనా విమోచనా సంస్థతో వియ్యమందే ప్రయత్నాలు ప్రారంభించారు. ఇది అమెరికావిధానంలో ఆకస్మికంగా వచ్చినమార్పు. ప్రసిడెంట్ రీగన్ పదవీ విరమణ చేసేలోగా పి ఎల్ ఓతో ఒకఅవగాహన కుదరడంగాని, ఇజ్రేల్‌ను సామరస్య మార్గంలోకి రప్పించడం గాని జరిగేపనులు కావు. జార్జిబుష్ అధ్యక్షపీఠం అలంకరించిన తర్వాత జరగవలసిన పనులు ఇవి. దశాబ్దాల తరబడి ఇజ్రేల్ ఆగడాలకు, అఘాయిత్యాలకు మద్దతు పల్కుతూ పాలస్తీనియన్ల స్వాతంత్ర్య కాంక్షను కాలరాస్తూ వచ్చిన అమెరికా విదేశాంగవిధానాన్ని ఇప్పుడీ సరికొత్త మార్గములో సవ్యంగా నడిపించడం జార్జిబుష్‌కు ఒక సవాలుకావచ్చు. స్వదేశంలోని తీవ్రవాదులను సంతృప్తిపరచడం అలాగే ప్రపంచ దేశాల అభీష్టంమేరకు స్వతంత్ర పాలస్తీనాఏర్పాటుకు సహకరించడం పరస్పరం పొసగనివిషయాలు.

అమెరికా వార్షిక బడ్జెట్‌లో ప్రస్తుతం 13000 కోట్లనుండి 15000 కోట్ల డాలర్ల వరకూ లోటు ఉంది. ఈ లోటులో కొంతయినా తగ్గించగలిగితే గాని జార్జిబుష్‌కు దేశప్రజలలో మంచిపేరు లభించదు.

ఈలోటు పెరగకుండానయినా చూడగలగాలి. ఇందుకు కొన్ని జనప్రియమైన పథకాలను ఉపసంహరించుకొని రక్షణరంగంలోఖర్చును కొంతకోతపెట్టవలసిఉంటుంది

ప్రెసిడెంటు రీగన్ స్వదేశంలోని తీవ్రవాదులకు అమెరికన్ అభిజాత్యాహంకారాలు కాపాడాలనే వారికి సంతృప్తి కలిగించడంద్వారా రెండవదఫా అధ్యక్షపదవికి ఎన్నికయారు. నికరాగువాలో కాంట్రా గెరిల్లాలకు అపారమైన సహాయం అందించటం, అఫ్ఘనిస్తాన్‌లోముజాహిద్దీన్ తిరుగుబాటుదారులకు మద్దతుపలికి వారికి ఆయుధాలను సరఫరాచేయడం లిబియా అధినేత గడాఫీ "ఆటలు కట్టించేందుకు నౌకా దళం చేత లిబియాపై దాడి జరిపించడము వంటి రీగన్ చర్యలు అమెరికాలోని తీవ్రవాదులకు ఆనందాన్ని కలిగించింది. అమెరికా పౌరుషాన్ని నిలబెట్టగలిగే మొనగాడుగా ప్రెసిడెంట్ రీగన్ వారి నుంచి ప్రశంసలు పొందారు. అయితే సోవియట్ అధినేత గోర్బచెవ్ శాంతిసాధనా కృషిలో చూపించిన అమితమైన అపూర్వమైన చొరవ ప్రెసిడెంట్ రీగన్ కాఠిన్యతకు అగ్నిపరీక్షలా పరిణమించింది. సామరస్య పథంలో గోర్బచెవ్ వంద అడుగులు ముందుకువేస్తే రీగన్ పది అడుగులయినా ముందుకు వేయక తప్పని పరిస్థితి తలఎత్తింది.

ఈ పరిస్థితులలో ప్రెసిడెంట్ రీగన్ సోవియట్ అధినేత గోర్బచెవ్‌తో ఫలప్రదమైన శిఖరాగ్ర చర్చలు జరపవలసి వచ్చింది. మధ్యశ్రేణి అణుశిపణుల నిర్మూలనా ఒప్పందంపై సంతకాలు చేయవలసి వచ్చింది.

రీగన్ ఈవిధంగా కాఠిన్యతను వదులుకొని సామరస్య మార్గంలోకి మళ్ళడం చాలామంది అమెరికన్లకు నచ్చిఉండదు. ప్రెసిడెంట్ రీగన్ ఉపసంహరించుకోడానికి నిరాకరించిన స్టార్‌వార్స్ పథకం జార్జిబుష్‌కు మరో పరీక్షగా పరిణమిస్తుంది.

ముఖ్యంగా అమితమైన చొరవ వేగంతోకూడిన గోర్బచెవ్ వ్యవహారసరళి, ప్రపంచ ప్రజల ప్రశంసలు పొందుతున్న ఆయన శాంతిప్రియత్వం జార్జిబుష్‌కు సంకటప్రాయం అవుతుంది. ఖండాంతర అణుక్షిపణుల నిల్వలను తగ్గించుకోవడానికి ఉద్దేశించే చరిత్రాత్మక ఒప్పందం ఇంకా కుదరవలసిఉంది. అన్నీ బాగుంటే ఈ ఒప్పందం జార్జిబుష్ హయాంలో కుదరవచ్చు. అయితే సోవియట్ అధినేత గోర్బచెవ్‌తో కలిసి అడుగు వేయాలా? లేక గతంలో మాదిరి అమెరికా తన పూర్వ కాఠిన్యతను ప్రదర్శించేటట్టు చూసి తన "ప్రత్యేకతను" చాటుకోవాలా అన్నప్రశ్న జార్జిబుష్‌ను కలవర పెడుతూ ఉండవచ్చు.

ప్రపంచంలో వివిధ ప్రాంతాలలో ఉద్రిక్తతలు నెమ్మది నెమ్మదిగా సడలి పోతున్నాయి సోవియట్ యూనియన్ గోర్బచెవ్ నాయకత్వంలో ప్రపంచ శాంతి సత్వర సాధనకు బాటలు వేస్తున్నది.

ఈ దశలో అమెరికా నుంచికూడా ప్రపంచం అదే వైఖరిని ఆశిస్తున్నది. మరి నూతన అధ్యక్షుడు జార్జి బుష్ అమెరికాను సామరస్య మార్గంలో నడిపించి ప్రపంచంలో శాంతి సుస్థిరతలను నెలకొల్పడానికి అణ్వస్త్ర మహమ్మారినిహతమార్చడానికి తోడ్పడతారో లేక కొత్త ఉద్రిక్తతలకు, వైషమ్యాలకు, యుద్ధాలకు అంకురార్పణ చేస్తారో వేచిచూడాలి.

—స్కైబర్డ్

## లేఖలు

### అభినందనలు

అయ్యా! భారత క్రికెట్ జట్టు న్యూజిలాండ్‌తో వండే సిరీస్ని 4-0తో కైవసం చేసుకొని ఆ జట్టుపై తమ సంపూర్ణ ఆధిపత్యాన్ని నిరూపించుకొని మనల్ని ఆనంద డోలికలలో ముంచెత్తింది. భారత క్రికెట్ కెప్టెన్ కల్నల్ వెంగ్‌సర్కార్ అనితరసాధ్య విజయం టెస్ట్‌సిరీస్ విజయం ఇప్పుడే వండేసిరీస్ విజయం తన ఖాతాలో జమ చేసుకొని మమ్మల్నానందపరిచాడు. అందుకే ఆయనజట్టు సభ్యులకీ మా హార్దికాభినందనలు తెలియజేస్తున్నాము.

మొదటివండేలో తన విశ్వరూపం కనబరిచిన శ్రీకాంత్‌కే మా అభినందనలు, ఇక రెండవవండేలో సిక్సర్లసిద్ధార్థ్ అద్భుత బ్యాటింగ్ విజయానికి మూలాధారమయ్యింది. ఇండోర్‌లో మూడవ వండేలో కొత్త ఓపెనర్ చంద్రశేఖర్ అద్భుత అజయమైన యువక రక్తం ప్రదర్శన చూపించగా శ్రీకాంత్ రెండోసారి విజృంభించగా చక్కటి విజయం లభ్యమైఅత్యంతానందం కలిగించింది ఇకనాల్గవ వండేలో సిరీస్ రాబట్టుకోవాలనుకొన్నాడు న్యూజిలాండ్ కాని ముందుగా పేరుబడ్డ బ్యాట్స్‌మన్ లకు ఊపిరి ఇవ్వగా యువరక్తం పరాక్రమించి తమసత్తాచూపి యువకిశోరాల్లా విజృంభించి విజయం సాధించిపెట్టారు. పంచర్‌దాయి లజరుద్దీన్ వన్డేలో శతకం అతితక్కువ బంతులలో సాధించడంద్వారా ప్రపంచ రికార్డు శతకం చెయ్యడం అమితానందకరం. మొత్తం నాలుగుమ్యాచ్‌లలో చక్కగా ఆడిన మిగతా ఆటగాళ్ళందరికీ మా అభినందనలు త్వరలో వెస్టిండీస్ పర్యటించే జట్టుని ఇప్పుడే ప్రకటించి వారికి తగిన ప్రాక్టీస్ ఇప్పటి నుంచే ఇవ్వడానికి మన సెలక్టర్లూ క్రికెట్‌బోర్డు కృషిచెయ్యాలని మా విజ్ఞప్తి.

కిషోర్. రవితేజస్వి, చింతలూరు, అంబాజీపేట మండలం, తూ గో॥

### మోపెడ్లపై పన్ను తీసివేయాలి

అయ్యా, నేడు సామాన్య ప్రజలు ద్విచక్ర వాహనమైన మోపెడ్లను ప్రయాణసాధనముగా వాడుచున్నారు. వీటి సన్నికి కాలము తక్కువ. గనుక వీటిపై జీవిత పన్ను విధించరాదు. పెట్రోలు ధర పెరిగిన కారణముగా ద్విచక్ర మోటారు వాహనాలపై పన్ను తీసివేస్తానన్న ముఖ్యమంత్రి తన వాగ్దానమును నెరవేర్చుకొనలేదు, పైగా జీవితపన్ను ఒకేసారి చెల్లించవలెనని ఉత్తర్వు చేశాడు. అందువలన సామాన్యులపై అధికభారము పడుచుండి. అమెరికాలో సగటున ముగ్గురికి ఒక కారు ఉంటుంది. అదే విధంగా మన దేశంలో కూడ మోటారు పరిశ్రమ విరివిగా అభివృద్ధి చెందుటకు మోపెడ్లపై జీవితపన్ను తీసివేయవలెను. ఇప్పుడున్న జీవిత పన్నులో 20 శాతము రాయితీ కంటితుడుపు చర్య మాత్రమే.

గుణ్ణం లక్ష్మణరావు, కూర్మాపురం,

### గడువు పెంచాలి

అయ్యా! ఆంధ్రా యూనివర్శిటీవారు తమ యూనివర్శిటీ కళాశాలలో ఎక్స్‌టెన్షన్ సెంటర్‌లలోచేరి పి జి కోర్సులు రెగ్యులర్‌గా చదువదలిచే విద్యార్థుల నుండి డి. డిసెంబరు7 వరకు దరఖాస్తులు స్వీకరించారు. దరఖాస్తు దారులకు సీటువచ్చినది, లేనిదీ తెలియకుండానే ప్రైవేటుగా చదువదలిచే అభ్యర్థులకు గడువుతేదీని జనవరి7గా ప్రకటించారు. దీనివలన రెగ్యులర్‌గా సీటు రాని అభ్యర్థులు నష్టపోవలసి వస్తుంది కాబట్టి యూనివర్శిటీవారు రెగ్యులర్ విద్యార్థుల లిస్టును ప్రకటించి, ప్రైవేటుగా చదువదలచేవారు దరఖాస్తు చేసే గడువుతేదీని మరొక నెలరోజులు ఉండేటట్లు సవరించవలసినదిగా కోరుచున్నాము.

ఎస్. వి. సుబ్రహ్మణ్యం, ఆర్. ఎస్. ఆర్. ఆంజనేయులు, వై. రామనరసింహం కేరాఫ్ ప్రిన్సిపాల్, ఎస్. ఎం. ఎస్. టి వి డి కాలేజి, ప్రొద్దుటూరు, కడపజిల్లా–516360.

### "ఆర్టీసీతో అగచాట్లు"

అయ్యా, సరైన వేళకు బస్సులు స్టాండుకురావు. వచ్చినా ఎప్పుడోగాని కదలవు, ఒకవేళ కదిలినా దారిపొడుగుట టిక్కెట్లు కట్ చేసేందుకు అరగంటకు పైనే అవుతాడు. ఆ తరువాత టికెట్ చెకింగ్ అధికారులు, మరొక గంట అవుతాడు. ఇక గమ్యస్థానం చేరకానే సరికి సగం ప్రాణంపోతుంది. ఇక పోతే అనారోగ్యంగా ఉన్నవారిని, ఏదైనా డాక్టరు దగ్గరకు అర్జంటుగా తీసుకొని వెళుతుంటే ఈలోపు ప్రాణమేపోతుంది. ఇక గ్రామాలకు వెళ్ళేబస్‌ల సంగతి సరేసరి డ్రైవరకు కండక్టరుకు బుద్ధి పుడితేపోతారు లేక పోతే డిపోలోనే వుంచుతారు. సరైన సమయానికి బస్‌లు వెళ్ళడం లేదు. దీనివలన ప్రజలు ఉద్యోగస్తులు ఎన్నో అవస్థలు పడుతున్నారు.

గుండాబత్తిని స్టీవెన్‌సన్, ఎడిసన్ యస్, రాబిన్‌సన్, క్యాంపన్ 9–25-32ఇ జనతాపేట కావలి నెల్లూరు జిల్లా 524202

### ఉద్యోగులకు ఇళ్ళు కట్టించాలి

అయ్యా, హైదరాబాదు నగరంలో ఇండ్లస్థలాల నిమిత్తం రాష్ట్రప్రభుత్వ ఉద్యోగులకు ప్రభుత్వం వెయ్యిఎకరాల భూమిని కేటాయించింది, అలాగే జిల్లా, మండల ప్రాంతాలలోకూడా ఇండ్లుగాని ఇండ్లస్థలాలుగానిలేనిఉద్యోగులకుఇండ్లస్థలాలు కేటాయించాలి. ఒక అటెండరు ఉద్యోగంచేస్తున్నవ్యక్తి నెలకు 1000 రూ॥లు జీతంలో 400రూ॥లు ప్రతి నెల ఇంటి అద్దెనిమిత్తం ఖర్చుచేస్తున్నాడు. మిగిలిన 600రూ॥లు కుటుంబ సభ్యులందర్నీ పోషించాలి, పిల్లల్ని చదివించాలి. ఇండ్ల అద్దెలు భరించుకోలేక ఎన్నో ఇబ్బందులకు ఉద్యోగులు లోనవుతున్నారు. ఇండ్లఅద్దెలతో ఉద్యోగులుపడుతున్న బాధలు వర్ణనాతీతం. ఒకసెంటు భూమిని పట్టణాలలో 20వేలరూ॥లకు అమ్ముచున్నారు. ఉద్యోగుల కుటుంబాల్ని పోషించడానికే చాలని జీతంతో ఇండ్లస్థలాలుకొనడం అసాధ్యం. కాబట్టి స్వంత ఇండ్లులేని ఉద్యోగులకు సానుభూతితో యుద్ధప్రాతిపదికపై గృహవసతి ప్రభుత్వం పోలీసులకువలె కల్పించాలి.

వి. గంగునాయుడు. 1.3.138, బలగ-532001 (శ్రీకాకుళం)

## "ఓ సింహాసనం కథ"

"ఎలాగో అలా మన రాజుగార్ని కిరీటికి దింపి ఆ సింహాసనాన్ని అధిష్ఠించటమే నా ఏకైక లక్ష్యం. విడివిడిగా మీ అందరి లక్ష్యం కూడా అదే, కాని "ఎవరికి వారు స్వంతంగా ప్రయత్నిస్తే మనకి పరాజయం తథ్యం."

"అయితేఏం చేద్దాం :"

"మనందరం కలిసి ఒక ఉమ్మడి పార్టీ పెట్టుకుందాం, అలామనం సంఘటితమయితే మన లక్ష్యం నెరవేరుతుంది."

"రాజును కూల్చటం ఒక్కటే మన ధ్యేయంగా పెట్టుకుంటే రాణించలేమేమో!" ప్రజాసంక్షేమందేశ శ్రేయస్సు దేశాభివృద్ధి లాంటి మౌలికాంశాలకు కూడా కాస్త ప్రాధాన్యతనివ్వాలిగదా ! మరీ సిద్ధాంతరహితంగా ఉంటే ఎలా?"

"ఏంపర్లేదు. మన ప్రజలకు కావాల్సింది. ఎమోషనల్ డైలాగ్స్ డ్రామా నాం పరంపర. ఈ విషయంలో మనం మన పాత్రల్ని చక్కగా పోషించగలిగితే. ప్రజలు మిగతా విషయాల్ని పట్టించుకోరు. మన ప్రజల మంచితనం బలహీనత నాకు బాగా తెలుసు."

"సరే! మీరు చెప్పినట్టే చేద్దాం."

"ఇంతకీ...ఉమ్మడి పార్టీ నాయకుడెవరు :"

"ఎవరేమిటి : నేనే ! ఇక్కడ నా ఆకర్షణకి తిరుగులేదు. ప్రస్తుతం పనున్నత, పేరు ప్రతిష్టలు గల పార్టీ మాదే. దేశంలో ఏమూలకెళ్ళి నేను ఎన్నికల ప్రచారం చేసినా...అక్కడ నిలబడ్డ అభ్యర్థి బంపర్ మెజార్టీతో గెలుస్తున్నాడు. మీకు తెలియందేముంది: సో...ఉమ్మడి పార్టీ నాయకత్వ నిర్వహణ బాధ్యతంగా నేనే !"

"అలాకుదర్దు. మొత్తం నాయకత్వ బాధ్యతని మీకప్పగించి మీవెనక బాకా ఊదటానికి మేము సిద్ధంగాలేము. మా పార్టీ ఎప్పట్నుంచో ప్రచారంలో ఉన్నది. దేశమంతటా విస్తరించి ఉన్నది, కనుక... నాయకత్వంలో నాకూ వాటాకావాలి."

"మాకు కూడా కావాలి,"

"మాకూడా"

"మాకూ ..."

"ఓకే, ఈ చిన్నవిషయంకోసం మనం భేదాభిప్రాయాలతో చీలిపోవటం నాకిష్టంలేదు. మన నాలుగుపార్టీల ప్రతినిధులుగా మనం నలుగురం నాయకత్వ బాధ్యతని స్వీకరిద్దాం."

"అలాగే ఇహ ప్రచారం మొదలెడదాం, మనటాకింగ్‌పవర్‌చూసి ప్రజలు గుమ్మెత్తిపోవాలి ఆ సంగతి నాకొదిలెయ్యండి. నా తడాఖా ఏమిటో మీరే చూద్దురుగాని"

"హమ్మయ్య ! మొత్తానికి రాజును లేపేసి సింహాసనాన్ని స్వంతం చేసుకున్నాం ఐకమత్యమే బలమని నిరూపించాం. నాకుచాలా సంతోషంగా-గర్వంగా ఉంది."

"అదిసరే ! ఇంతకీ... రాజెవరు ?"

"ఇంకెవరు : నేనే! నేనే లేకపోతే మన పార్టీ గెలిచేదేకాదు. కనుక... రాజును నేనే మీకందరికీ మంచిమంచి పదవులిస్తాను."

"ఎవరికొ్కావాలి బోడిపదవులు ? నేనే రాజుని. నా ప్రమేయం లేకుండా ఉంటే మీరెవరూ గెలిచేవారే కాదు."

"ఏమిటి మీఇద్దరి పంపకాలు: నేను దీనికి అంగీకరించను, ఆ మాటకొస్తే "మన సహకారం లేకుంటే మీరు గెలిచేవారేకాదు. సో... రాజునునేనే!"

"నో, నో, మీ ముగ్గురి వాదనా నేను సమర్థించవలసుకో లేదు. మా పార్టీ ఎప్పట్నుంచో ఈ దేశంలో పాతుకుపోయి ప్రజలఅభిమానాన్ని చూరగొంది అసలు "మామూలానే మీరు గెలిచారు కాబట్టి "నేనే రాజుని"

"కాదు నేనే",

"నేనే,"

"నేనే,"

"నేనే,"

"ఒక దేశానికి నలుగురు రాజులెలా ఉంటారయ్యా?"

"అందుకే. మీరు తప్పుకోండి"

"ఊహూ! మీరే"

"ఓరి దేముడా ! పీళ్ళలో వీళ్ళలా తన్నుకుంటున్నారేమిటి : దేశాన్ని ప్రజల్ని గాలి కొదిలేసి...కేవలం అధికారం కోసమే గెలిచినట్లు ఈ కుమ్ములాట లేమిటి : ఎంతకీ అరదేం వీళ్ళరగడ : !

"అయ్యయ్యో ! సింహాసనాన్ని పగలగొట్టి నాలుగు ముక్కలుగా చేసి తలా ఒక ముక్క తీసుకుంటున్నారేమిటి:"

వీళ్ళకసలు సిద్ధాంతాలు లేవా :

అధికార దాహం తప్ప, దేశ సంక్షేమం వీళ్ళకవసరం లేదా :

మాతృభూమి పసిబ్బిడ్డ. తిరిగి, దాస్యశృంఖలాలు తగిలించుకోబోతోందా :

కన్నెత్తి ఇటువేపుచూడరేం వాళ్లు: ఎందుకు గెలిపించాం వీళ్ళని: పంచుకోటానికి ఇదివాళ్ళ వారసత్వపు ఆస్తిహక్కా : ఛా ! ఈదేశానికి కొత్తగాలి కొత్త రక్తం అబ్బిరావు కాబోలు !

బూజు పట్టినట్లున్నా... పాతసిద్ధాంతాలు, పాత నాయకులే మేలు !

ఈసారి మరో ఆలోచన లేకుండా వాళ్ళనే గెలిపించాలి."

"ఔను, అంతే!"

—అద్దూరి సావిత్రి

## సూక్తిముక్తావళి

నపంతి హీసురా భాండా సురాయా ఏవబందనః

(లోకోక్తి)

పాత్రనుండి కల్లుమక్కలే కారతాయి...అంటే మనిషి మనస్సు ఎలాంటిదయితే అటువంటి కార్యక్రమాలే జరుగుతూ ఉంటాయి, అది సహజం కదా.

## దినఫలం

నేటి పంచాంగం

శ్రీ విభవనామ సం. మార్గశిర మాసం, బహుళం.

1988 డిసెంబరు 25: 11.00 నక్షత్రం: పు. 8.3 వరకు

1988 డిసెంబరు 26. 12.00 నక్షత్రం: ఉ. 1-2.59 వరకు

**మేషం:** [illegible]

**వృషభం:** [illegible]

**మిథునం:** అనుకూలంగా ప్రవర్తించి ఒకరొకరు వ్యవహారంగాన మేలు పొందనున్నారు, విద్యావేత్తం ధనవంతుల సహాయసంపత్తున్నాయి.

**కర్కాటకం:** ఆదాయమున్నది గ్రహించండి. సర్వవిధాలా అనుకూల వాతావరణమే. శుభసందర్భాలు లేకపోలేదు. ఒకానొక వ్యవహారం మీ పక్షం కానున్నది.

**సింహం:** రాజకీయవాదులకు క్షేమకరం, వృత్తియందు విరామం. మాట వరుసలో పాలించుకు వచ్చి, తర్వాత మీకు అనుకూలంవుంది.

**కన్య:** విద్యావేత్తలు, బంధువుల సహాయమున్నది. గమనించు, కార్యానుకూలం, పనిచేయువారికి అనుకూలసమయం, ఫలసాధన ప్రసిద్ధి.

**తుల:** ఆరోగ్యవృద్ధి. మాట వినిమయం విరోధించి, కొందరకు దూరప్రాంతాలకు వెళ్ళే అవకాశమున్నది. అభివృద్ధికరమైన మార్పులు రానున్నాయి.

**వృశ్చికం:** సర్వవిధాలా మీకు అనుకూలమే. సుఖకాండులున్నాయి. సభామర్యాదల ఆకర్షం, దూరప్రాంతాలకు ప్రయాణించుట తగదు.

**ధనుస్సు:** రాజకీయాలు మీకు అనుకూలంగావు, స్త్రీలవలన ఏదో మార్పు రానున్నది, సుఖకాండులున్నాయి. విద్యావిషయంగా పెంపుచేకూరుట నిశ్చయం.

**మకరం:** కళాసాహితీపరులు మీరయితే చక్కని అవకాశాలు లభ్యమవుతాయి. శుభదాయక సమయం, అనుకూలమిత్ర సమాగమం, రాజకీయాలు మేలుగావు.

**కుంభం:** విచిత్రంగాన అనుకూల సమయం, సదవకాశం లభ్యం కానున్నది. మాట నలుగురిలో ప్రసిద్ధినందనున్నది. పథకాన్యాయక ఆస్కార మైనది సం.

**మీనం:** శుభదాయక దినం. సభాగౌరవం, పత్రికారంగానుకూలం దినం. మిత్రుల వ్యాపారం లాభదాయకం, కొందరు వివాహం మార్పులున్నారు. గమనించండి.

—విద్వాన్‌కోట సత్యరంగయ్యశాస్త్రి

## మీకుతెలుసా? – వాసు

టెన్నిస్ గ్రాండ్‌స్లామ్–
ఫ్రెంచ్, అమెరికన్
వింబుల్డన్, ఆస్ట్రేలియన్
ఛాంపియన్ షిప్స్
ఒకసంవత్సరంలో
గెలుచుకోవటం–
1937 లో డొనాల్డ్
బడ్జ్ (అమెరికా) మొదట
సారిగా సాధించాడు.

## మహాభారతం

సంస్కృతమూలం: వేదవ్యాస మహర్షి
తెనుగుసేత: రాంపల్లి శ్రీరామచంద్రమూర్తి

### చతుర్దశాధ్యాయము (ఆదిపర్వము)
### (ఆస్తీకపర్వము)

[ గత సంచిక తరువాయి ]

శ్లో॥ పితమహస్తే తతఃప్రాదాత్॥ భార్యార్థే వరవర్ణినీం
సపతాం ప్రతిజగ్రాహ॥ విధిదృష్టేన కర్మణా 7

భా : నాగరాజట్లు వాసుకి సుందరియైన జరత్కారుడుకు కన్యాదాన ముఖంగా నా జరత్కారుడు శాస్త్రవిహితమైన పద్ధతిలో స్వీకరించెను.

ఇది పదునాల్గవ యధ్యాయము

### పంచదశాధ్యాయము (ఆదిపర్వము)
### (ఆస్తీకపర్వము)

సౌతియువాచ (ఉగ్రశ్రవుడు పలికెను)

శ్లో॥ మాత్రాహి భుజగాశ్శప్తాః॥ పూర్వం బ్రహ్మవిదాంవర
జనమేజయస్యవో యజ్ఞే॥ ధక్ష్యత్యనిలసారథిః 1

భా : బ్రహ్మవిదులలో శ్రేష్ఠుడవైన శౌనక! జనమేజయుని సర్పయాగమున అగ్నిమిమ్ము భస్మము చేయుగాక యని నాగమాతయైన కద్రువ సర్పములను శపించినది.

శ్లో॥ తస్య శాపస్య శాన్త్యర్థం॥ ప్రదదౌ పన్నగోత్తమః
స్వసారమృషయే తస్మై॥ సువ్రతాయ మహాత్మనే 2

భా : నాగరాజగు వాసుకి కద్రువ యిచ్చిన శాపమును శమింపచేయుటకై మంచివ్రతవరుడైన జరత్కారువను మహాత్మునకు తనచెల్లెలి నొసంగెను.

శ్లో॥ సపతాం ప్రతిజగ్రాహ॥ విధిదృష్టేన కర్మణా
ఆస్తీకో నామ పుత్రశ్చ॥ తస్యాం జజ్ఞే మహామనాః 3

భా : జరత్కారుడును ఆజరత్కారువును విధివిధానముగా స్వీకరించి ఆస్తీకుడను పుత్రునిగూడ బడసెను.

శ్లో॥ తపస్వీచ మహాత్మాచ॥ వేదవేదాంగ పారగః
సమస్సర్వస్య లోకస్య॥ పితృమాతృ భయాపహః 4

భా : ఆస్తీకుడు వేదవేదాంగ పారంగతుడైన పండితుడు, తపస్వి. మహాత్ముడు ఎల్లరియందు సమభావము కలవాడు, పితృవంశమునకు మాతృవంశమునకు కలిగిన భయమును పోగొట్టువాడు.

శ్లో॥ అథ దీర్ఘస్య కాలస్య॥ పాండవేయోన రాధిపః
ఆజహార మహాయజ్ఞం॥ సర్పసత్ర మితిశ్రుతిః 5

భా : తరువాత చాలాకాలమునకు పాండవ వంశీయుడైన జనమేజయుడు సర్పయాగమను పేరుగల మహాయజ్ఞము చేసెనని వింటిని.

శ్లో॥ తస్మిన్ప్రవృత్తే సత్రేతు॥ సర్పాణా మన్తకాయవై
మోచయామాస తాన్నాగా॥ నాస్తీకస్సు మహాతపాః 6

భా : సర్పనాశనమునకై జరిగిన యా సర్పయాగమున కడుదెంది మహాతపస్వియైన యాస్తీకుడు సర్పములకు మృత్యుభీతిని తొలగించెను.

శ్లో॥ భ్రాతౄంశ్చ మాతులాం శ్చైవ॥ తథై వాన్యాన్ స పన్నగాన్
పితౄంశ్చ తారయామాస॥ సన్తత్యా తపసా తథా 7

భా : అతడు సోదరులను మేనమామలను బంధువర్గము కల యితరసర్పములను తరింపచేయుటయే కాక సంతానముచేతను తపస్సుచేతను పితరులను కూడా తరింపజేసెను.

[ సశేషం ]

# విశ్వదర్శనం

## బర్మాలో ఆరిన చిచ్చు

బర్మాలో ప్రజాస్వామ్య పునరుద్ధరణ కోసం ఇటీవల జరిగిన ఉద్యమం రక్తపాతానికి దారితీసింది. సైనిక పాలకులు ఈ ఉద్యమాన్ని కఠినంగా అణచివేశారు. బర్మాలో జోక్యం చేసుకోడానికి పొంచివున్న దేశాలకు ఆశాభంగమైంది. బర్మాలో ప్రజాస్వామ్యం పునరుద్ధరించబడితే అందరూ సంతోషించేవారు. కాని ప్రజాస్వామ్యం పేరుతో అక్కడ కొందరు మతాన్ని రెచ్చగొట్టారు. బౌద్ధారామాలలో మతబోధ చేసుకునే బౌద్ధ మఠాధిపతులు రంగంలోకి దిగి ప్రజలను రెచ్చగొట్టడంతో పరిస్థితి విషమించి రక్తపాతానికి దారితీసింది. విద్యార్థులు, యువకులు పోరాట జ్వాలల్లో చిక్కుకుపోయి విపరీత నష్టానికి గురి అయ్యారు. విదేశీ రాయబార కార్యాలయాలలోని సిబ్బంది కుటుంబాలు స్వదేశానికి తిరిగి వెళ్ళిపోవలసి వచ్చింది, దేశం ఆర్థికంగా దివాలా స్థితికి చేరింది. విద్యార్థులు పెద్ద సంఖ్యలో పొరుగున గల థాయ్‌లాండ్‌కు పారిపోయారు. కొందరు అడవులలోకి పోయి తిరుగుబాటు గెరిల్లాదళాలలో చేరిపోయారు. ఇటీవల థాయ్‌లాండ్ సరిహద్దులలో పోరాటం చెలరేగి వెయ్యిమందికి పైగానే మరణించారని బ్యాంకాక్ నుంచి వార్తలొచ్చాయి. బర్మా ప్రభుత్వం, థాయ్‌లాండ్ ప్రభుత్వంతో పేచీ పడింది. దౌత్య సంబంధాలు కూడా తెగిపోయే పరిస్థితి వచ్చేసరికి థాయ్‌లాండ్‌వారు, తమ దేశంలోకి పారిపోయి వచ్చిన బర్మా విద్యార్థులను, యువకులను స్వదేశానికి తిరిగి పంపివేయాలని నిర్ణయించారు.

బర్మా విద్యార్థుల ప్రతినిధి వర్గాన్ని బర్మా రాజధాని రంగూన్‌కు పంపి, అక్కడి ప్రభుత్వంతో మంతనాలు జరిపే ఏర్పాట్లు చేస్తున్నారు. స్వదేశానికి తిరిగి వచ్చినవారిని క్షమించి విడిచిపెడతానని, అలాకాక సరిహద్దులకు అవతల వుంటూ, పోరాటం జరిపేవారిని కాల్చివేస్తానని బర్మా సైనిక ప్రభుత్వం ఇదివరకే ప్రకటించింది. ఈ ప్రకటనను పురస్కరించుకుని బర్మా విద్యార్థులు రంగూన్ వెళ్ళడానికి సిద్ధమవుతున్నారు. అందుకే ముందుగా తమ ప్రతినిధి వర్గాన్ని పంపాలని నిర్ణయించుకున్నారు. బర్మాలో వచ్చిన అంతరంగిక పరిణామాలను, స్వప్రయోజనాలకు వాడుకోవడానికి ప్రయత్నించకుండా, పొరుగు దేశాలు ఈ ప్రాంతంలో శాంతి పునరుద్ధరణకు సహాయపడటం అవసరమని భావించాలి.

## బ్రిటన్‌లో జాతి వివక్షణ

బ్రిటన్ జాతి వివక్షణను రూపుమాపుతున్నామని శ్రీమతి మార్గరెట్ థాచర్ ఢంకాలు పలుకుతున్నారు. ఏవేవో చట్టాలు తెస్తున్నామని కూడా ఆమె అంటున్నారు. దక్షిణాఫ్రికా ఊసును కూడా వాలనివ్వని బ్రిటిష్ ప్రభుత్వం, ఎప్పుడు భద్రతా మండలిలో ప్రిటోరియా ప్రభుత్వానికి వ్యతిరేకంగా తీర్మానం పెట్టినా ప్రతిఘటించే థాచర్ ప్రభుత్వం తన దేశంలో జాతి వివక్షణను ఎంతవరకు అరికట్టగలదనే విషయం సందేహాస్పదమే. ఇందుకు ఉదాహరణగా గ్రెనడా నుంచి ఎప్పుడో బ్రిటన్ వలసవచ్చి స్థిరపడిపోయి పార్లమెంటేరియన్‌గా పేరు పొందిన లార్డ్సభ సభ్యుడు డేవిడ్‌పిట్ బ్రిటన్‌లో జాతివివక్షణ పట్ల తీవ్రావేదన వ్యక్తంచేశారు.

వెస్ట్ ఇండియన్లను, కామన్వెల్తు దేశాలనుంచి వలస వచ్చిన నల్లజాతి వారిని బ్రిటిషర్లు ఇంకా వెలివేస్తూనే వున్నారని ఆయన చెబుతున్నాడు. జాతి వివక్షణ అనేది తగ్గడానికి బదులు పెరుగుతోందన్నారు.

20 ఏళ్ళుగా సాగుతున్న ఈ వ్యవహారాన్ని తాను రుపుమట్టించదలచానన్నారు. లార్డ్స్ సభ (పార్లమెంటు ఎగువసభ)లో నల్లజాతి సభ్యుడు తానొక్కడినేనని, మిగతావారితో మసలడంగాని, మంతనాలాడటంగాని చాలా కష్టంగా వుందని పిట్ అంటున్నాడు. బ్రిటిష్ పార్లమెంటులో నల్లజాతీయుల గ్రూపును ఏర్పాటు చేయడానికి గట్టి ప్రయత్నమే చేస్తున్నాను, అప్పుడుగాని ఏమైనా చేయగలం. జాతి వివక్షణ సమస్యలపై ఆందోళన ప్రారంభించడం ఖాయం అని పిట్ ఆవేశంలో అన్నాడు.

బ్రిటన్‌లో పెరుగుతున్న జాతి వివక్షణను ఎదుర్కోడానికి ఇతర దేశాలలోను, ముఖ్యంగా అమెరికా-ఆఫ్రికన్ అమెరికా దేశాలలోను నల్ల జాతీయుల సహకారాన్ని తాను తీసుకుంటానన్నాడు. ఇటీవల బ్రిటిష్ ప్రభుత్వం తెచ్చిన ఒక చట్టం ఫలితంగా బ్యాంకులు, దుకాణాలు, ఇతర వ్యాపార సంస్థలలో నల్లవారికి అక్కడక్కడ ఉద్యోగాలు దొరుకుతున్నాయని పిట్ చెప్పారు.

## ఐ.రా.స. ప్రాధాన్యం

ఐ.రా.స ప్రాధాన్యత ఇటీవలికాలంలో బాగా పెరిగినట్లు కనబడుతోంది. ఇది అంతర్జాతీయ చర్చావేదికగా మాత్రమే ఇదివరకు వినియోగపడేది. ఒకవేళ ఏదైనా తీర్మానం చేసినా దాన్నెవరూ పట్టించుకునేవారుకాదు. ముఖ్యమైన సమస్య ఏదైనా భద్రతామండలికి వెడితే, అగ్రరాజ్యాలు వాస్యర్థం చేసుకుని, తీర్మానం నెగ్గినా దాన్ని ఏదో ఒక అగ్రరాజ్యం వీటో చేసేది. దానితో అన్ని దేశాలు నీరసించిపోయేవి. ముఖ్యంగా చిన్నదేశాలు ఈ ఐ.రా.స వరమదండగ అనుకునేవి. అటువంటిది రానురాను అంతర్జాతీయ పరిస్థితులు మారిపోయాయి. ఆయా దేశాలలోని అంతరంగిక సమస్యలు, జాతీయ ప్రయోజనాలు వంటివి ఈ మార్పుకు ప్రధాన కారణమని చెప్పాలి. ఏ అగ్రరాజ్యానికైనా ఒక దేశం తన భూభాగాన్ని స్థావరంగా వినియోగించుకోడానికి అనుమతిస్తే ఇతర దేశాలతో వాణిజ్య తదితర సంబంధాలు పెట్టుకోడం కష్టమైపోతోంది.

ఇలాంటి పరిస్థితులున్న చిన్నదేశాలు తమ వైఖరిని మార్చుకుని శాంతియుతవాతావరణం లేకపోతే అభివృద్ధిచెందడం కష్టమని గుర్తిస్తున్నాయి. తమదేశంలో వున్న ఇతరుల సైనిక స్థావరాలను ఖాళీచేయించడమే గాక, తమ ప్రాంతంలోకూడా ఇతరుల యుద్ధనౌకలు ఉండరాదన్న అభిప్రాయానికి వస్తున్నాయి. ఇది చాలా మంచి పరిణామమనే చెప్పాలి.

ఆగ్నేయాసియాలోని ఫిలిప్పీన్స్ ఇలాంటిదేశాలలో ఒకటి. ఎంతోకాలంగా దీనికి అమెరికాతో దగ్గరిసంబంధాలున్నాయి. ఫిలిప్పీన్స్‌లో క్లార్క్ అనేచోట అమెరికా విమానస్థావరం, సుబిక్ అనేచోట అమెరికా నౌకాస్థావరం వున్నాయి. ఇవి వున్నాయన్న కారణంతో రష్యావారు ఫిలిప్పీన్స్ సమీపంలోని కామ్‌రాన్ అఖాతంలో తమ యుద్ధనౌకలు వుంచారు. ఇందువల్ల ఫిలిప్పీన్స్‌వారికి రష్యాతోను, ఇతర తూర్పు యూరోపు దేశాలతోను వాణిజ్య తదితర సంబంధాలు నెలకొల్పుకొనడం కష్టమైపోతోంది. ఈ పరిస్థితి పోతేగాని మోక్షంలేదన్న అభిప్రాయానికి వచ్చి అమెరికా స్థావరాలను ఖాళీ చేయించాలనుకుంటోంది. ఈ సంగతి చూచాయగా తెలిసి మనీలా వచ్చిన రష్యా విదేశాంగమంత్రి షెవర్నాడ్జె అమెరికా స్థావరాలు తొలగిస్తే, తమ యుద్ధనౌకల్నికూడా తీసేస్తామని హామీయిచ్చారు. ఐ.రా.స ద్వారా ఈ పనిజరగడం సముచితమనికూడా అన్నారు. ఇందులో ఫిలిప్పీన్స్ ప్రభుత్వంకూడా సుముఖత తెలిపింది. ఐ.రా.స తీర్మానాల ద్వారా కంపూచియా సమస్యకు కదలికవచ్చింది. అలాగే ఫిలిప్పీన్స్‌విషయంలో కూడా ఐ.రా.స జోక్యం చేసుకుంటే సంతోషించని వారుండరు.

## అమెరికా కొత్త పేచి

మూడడుగులు ముందుకువేస్తే ఆరడుగులు వెనక్కు వేస్తున్నట్లుగా వుంది నమీబియా సమస్య. అంతేకాదు. ఏ సమస్యనూ ఒకపట్టాన పరిష్కారం కానివ్వదు అమెరికా, ఇది మళ్ళ పేచీలు పెట్టడంలో దిట్ట. సుదీర్ఘ చర్చలు జరిగినమీదట, ప్రపంచదేశాలు ఒత్తిడితెచ్చిన మీదట ఐ.రా.స రొమ్ము, భద్రతా మండలిలోను తీర్మానాలు చేసిన పిమ్మిలా ఎట్టకేలకు ఒప్పందం కుదిరింది. నమీబియాకు స్వాతంత్ర్యం అప్పగించే కార్యక్రమాన్ని, ముఖ్యంగా అక్కడి నుంచి దక్షిణాఫ్రికా సైనికదళాలు వెళ్ళిపోయేకార్యక్రమాన్ని పర్యవేక్షించేందుకు సమితి శాంతిదళాలు వుండాలని భద్రతామండలి తీర్మానించింది. ఈ దళాల కమాండర్‌ను సమితి ప్రధానకార్యదర్శి నియమిస్తారు. ఇదంతా బాగానే వుంది. కాని ఇప్పుడు అమెరికా కొత్తపేచీకి దిగింది. ప్రిటోరియాలోని శ్వేతజాతి పాలకులతో ఎప్పుడూ ఈ అమెరికా పాలకులు కుమ్మక్కవుతూనే వుంటారు. నమీబియాకు స్వాతంత్ర్యం ఇవ్వాలని ఒకప్రక్క చెబుతూనే మరోప్రక్కన దక్షిణాఫ్రికా పాలకుల ప్రయోజనాలు కాపాడేందుకు ప్రయత్నిస్తుంటాడు. ఇలాంటి ద్వంద్వ విధానంవల్ల నమీబియాకు స్వాతంత్ర్యం లభించడం ఆలస్యమైపోతోంది. ఇప్పుడు పెట్టిన కొత్తపేచి ఏమిటంటే, సమితి శాంతిసేనల ఖర్చు తగ్గాలని, అందుకు వీలుగా దీనిలోకి చేర్చుకునే సైనికులసంఖ్యను కూడా తగ్గించాలని అమెరికా అంటున్నది. ఇందుకు నమీబియా, దాన్ని బలపరుస్తున్న దేశాలు గట్టిగా వ్యతిరేకించాయి. శాంతిసేన బలంగా లేకపోతే దక్షిణాఫ్రికాకే పరిస్థితి అనుకూలంగా వుంటుంది. నమీబియాలో ప్రిటోరియాకు అనుకూలవర్గాలున్నాయి. వీరికి మిలిటెంట్ గ్రూపులుకూడా వున్నాయి, ఈ గ్రూపులు ఇప్పటికే హింసాత్మక చర్యలు జరుపుతున్నాయి. దీనివల్ల అశాంతి ప్రబలుతోంది. నమీబియాకు స్వాతంత్ర్యమిచ్చే కార్యక్రమంగనుక ప్రారంభమైతే, ఈ గ్రూపులను ప్రిటోరియా పాలకులు రెచ్చగొట్టి అల్లర్లు వ్యాపింపజేస్తారు. శాంతి భద్రతలు కాపాడేందుకు అన్ని హంగులుగల సైన్యం అవసరమనే సాకుతో ప్రిటోరియా తన దళాలను కదలనివ్వదు.

డెయిలీ సీరియల్

రావినూతల సువర్ణాకన్నన్

# భువనతరంగిణి

**41** "రారా మాధవా! రేపో బ్రహ్మాండమైన సంబంధం వారు రాబోతున్నారు" అన్నాడు రామ్మూర్తి ఉత్సాహంగా.

మొహాలు చూసుకున్నారు మాధవ్, సుందరమ్.

"ఇదీ ఆ పేరయ్యగారు తెచ్చిందేనా!" వ్యంగ్యంగా అంది యమున.

"మీరంతేగా" మళ్ళీ నవ్వాడు రామ్మూర్తి. మాట్లాడకుండా కాస్సేపు కూర్చుని వెళ్ళిపోయాడు మాధవ్.

పెళ్ళివార్ని తీసుకురావడానికి వెళ్ళిన పేరయ్య సాయంత్రం ఆడుదాటుతున్నా రాలేదు. రామ్మూర్తి, భార్య ఇంట్లోకి బైటకి కాలుకాలిన పిల్లిలా తిరుగుతున్నాడు.

"ఆవచ్చేవాళ్ళు లోపలికి రారానాన్నా! ఎందుకలా తిరుగుతాడు" అంది యమున.

రామ్మూర్తి నవ్వాడు.

"మాఅదుర్దా మాదమ్మా! అదినీకు చెప్తే అర్థంకాదులే. రేపునీకూ ఓకూతురు పుట్టి, దాని పెళ్ళి చెయ్యాల్సొచ్చినప్పుడు గానీ తెలియదు" అన్నాడు.

యమున నవ్వలేదు. మౌనంగా వుండిపోయింది.

ఏడుగంటలు దాటుతుండగా వచ్చాడు పేరయ్య ఒంటరిగా.

"వాళ్ళేరీ!" ఆత్రంగా అడిగాడు రామ్మూర్తి.

"రాలేదు..." కుర్చీలో కూలబడుతూ అన్నాడు పేరయ్య.

"ఏం మళ్ళీ వస్తామన్నారా" అంది దుర్గ.

"ఊహూ!"

"మరి ? నేనొచ్చి పిలవలేదని కోపం వచ్చిరాలేదు కదూ. చూశారా పేరయ్యగారూ ! నేను మొదట్నించి చెప్తూనే వున్నాను. పోన్లెండి రేపు ఇద్దరం కలిసి వెళ్దాం" తనేవూహించిఅన్నాడురామ్మూర్తి

"అదేంకాదు మాస్టారు !"

"నాన్చక విషయం సూటిగాచెప్పండి" తీక్షణంగా చూస్తూ అన్నాడు సుందరం.

అతనన్న తీరుకి దిత్తరపోయారు అంతా.

"చెప్పండి పేరయ్యగారూ ఏం జరిగింది !" ఆదుర్దాగా అడిగింది దుర్గ.

"అమ్మాయి...వుద్యోగం చేస్తోంది కదా.

"అవును చేస్తోందిగా ఇంకేమిటి అభ్యంతరం !

"కాని వాళ్ళకి వుద్యోగం చేసే అమ్మాయి మీద సదభిప్రాయంలేదట."

కొయ్యబారిపోయారంతా.

"దాందేం వుంది. పెళ్ళవగానే మానేస్తుంది" శేడుకున్న దుర్గ అంది.

"అయినా వాళ్ళకి ఒద్దన్నాడు."

అంతా వింటున్న యమున పగలబడి నవ్వింది. భయంగా చూశారంతా

"యమునా !" మెల్లగా పిల్చాడు రామ్మూర్తి

"ఏవిట్నానా ! వుద్యోగం మానెయ్యనా :" భావరహితంగా అంది యమున.

దెబ్బతిన్నట్టు చూశాడు రామ్మూర్తి.

"ఇంతోటిదానికి నువ్వు ఉద్యోగం మానడం ఎందుకమ్మా వాడు కాకపోతే వాడి తాతలాంటివాడు మరొకడు" తేల్గ్గా అన్నాడు పేరయ్య

"తాతలాంటి వాళ్ళని, తండ్రిలాంటి వాళ్ళని ఇంకెవరికైనా చెప్పండి మాకు మాత్రంవద్దు గంభీరంగా అన్నాడు సుందరం.

"ఏమిటిబాబూ ఇవాళ నామీద కారాలూ మిరియాలూ నూరుతున్నావ్ :" బలవంతంగా నవ్వుతూ అన్నాడు పేరయ్య.

"చూడండి పేరయ్యగారూ ! దయచేసి ఇంక మీదు మా యమునకే సంబంధాలూ తీసుకురాకండి అదే మా నెత్తిన పాలు పోసినట్టు"

"ఏమ్మాటల్లాఅవి"విసుక్కుంది దుర్గ

"లేకపోతే ఏవిటమ్మా ! ఎంతసేపూ ఆయన స్వార్థమే తప్ప మన బాధలు చూస్తున్నాడా ? ఆడేనంటే ఆడపిల్లని కన్నందుకు ఇలాంటివి తప్పవుఅంటాడు ఆయనకేం మడతనలగని బట్టలుకట్టుకొని స్టార్‌హోటళ్ళలో జల్సాలు చేస్తూ ఎవడు దొరుకుతాడా అని చూస్తూంటాడు మన బాధలు ఆయనకేం తెలుస్తాయి ! అదుపు తప్పిన ఆవేశంతో అన్నాడు సుందరం. అతని ఆవేశానికి నిర్ఘాంతపోయారు రామ్మూర్తి దుర్గ

పేరయ్య మొహం తెల్లగా పాలిపోయింది

"సుందరం తొందరపడకు మనరాత బావుండనప్పుడు ఆయన మాత్రం ఏం చేస్తారు కాలం కర్మం కలిసిరావాలంటారందుకే" అనునయంగా అన్నాడు రామ్మూర్తి

ఈ పేరయ్యగారు వస్తున్నన్నాళ్ళూ మనకి కాలం కలిసిరాదు కర్మ తప్ప.

"మరీ అంత అన్యాయంగామాట్లాడకు సుందరంబాబూ! సంబంధం కుదిరితే నాలుగురాళ్ళొస్తాయని నా ఆరాటం కానీ ఈనాడు పెళ్ళికొడుకులు క్షణానికోమాట మారుస్తున్నారు ఆ మాటలు నమ్ముకుని ఇదిగో ఇలా మీ అందరిచేతా చివాట్లు తింటున్నాను" బాధగా అన్నాడుపేరయ్య

అతని మొహం చూసిన సుందరానికి తను తొందర పడ్డాననిపించింది

"సారీ! ఏంచేస్తారో తొందరగా చెయ్యండి" అంటూ వెళ్ళిపోయాడు

"పేరయ్య గారూ! వాడి మాటలు పట్టించు కోకండి ఆవేశం తప్ప ఆలోచన లేని వుడుకు రక్తం."

అనునయంగా అన్నాడు రామ్మూర్తి.

"ఇలాంటివి పట్టించుకుంటే మేం బతికేదెలా మాస్టారూ, మొహాన వుమ్మేసినా తుడుచుకుని చిరునవ్వు నవ్వాల్సొస్తుంది ఒకోసారి" బలవంతంగా నవ్వుతూ అన్నాడు పేరయ్య.

మరో పది నిమిషాల తర్వాత వెళ్తానంటూ లేచాడు.

* * *

కాలగమనంలో మరో ఆర్నెల్లు గడిచిపోయాయి. మాధవ్, యమునల ప్రోత్సాహంతో అయ్యేఏస్ ప్రిలిమినరీ పరీక్ష రాశాడు సుందరం. రిటయిరయినప్పుడు వచ్చిన డబ్బులో ప్రస్తుతం రామ్మూర్తి దగ్గర మిగిలింది పదిహేను వందలు మాత్రమే! యమున పెళ్ళి చూపులకని, సుందరం పుస్తకాలకని మాధవ్ దాచుకున్న డబ్బు కూడా కర్పూరంలా ఆరిపోయింది.

అందుకు మాధవ్ బాధ పడ్డేదు. కాస్తలో కాస్తయినా మాస్టారి ఋణం తీర్చుకుంటున్నానని ఆనందించాడు.

ప్రస్తుతం పనికి ఇంటికే తప్ప ఎక్కడికీ వెళ్ళడం లేదు. ఏ హోటల్లో తింటున్నాడో గాని బైటే భోం చేస్తున్నాడు.

ఈ ఆర్నెల్లలో ఒకటి రెండుసార్లు కబురుచేశాడు చందర్. అయితేఅతనెళ్ళిన రెండుసార్లూ తర్మగాడు వుండడం తనని కదల్నియ్యకుండా కూర్చోపెట్టడంఏవేవో మాట్లాడ్డం అతనికి చిరాకనిపించింది. అందుకే చందర్ కబురంపినా వెళ్ళడం లేదీ మధ్య.

ఆ రోజు సాయంత్రం గుమ్మం బైట కూర్చుని ఏదో పేపర్ తిరగేస్తున్నాడు.

యమున వచ్చిందక్కడికి.

"ఏవిటి యమునా! అప్పుడే వచ్చేశావ్ ఇవాళ స్కూల్ లేదా:" అన్నాడు యమున కూర్చున్నాక.

యమున మొహం గంభీరంగా వుంది.

"ఏవిటి కొంపతీసి ఆ పేరయ్యగాడు మళ్ళీ ఏదైనా సంబంధం తెచ్చారా:" మాధవ్ తమాషాగా అన్నాడు.

"సంబంధం మాటకేం గానీ నేనో మాట అడుగుతాను నిజం చెప్తావా:" సీరియస్‌గా అంది యమున.

"నీతో నేనెప్పుడైనా అబద్ధం చెప్పానా:" ఎదురుప్రశ్న వేశాడు మాధవ్.

"మునుపు లేదు, కానీ ఇటీవల మొదలుపెట్టావ్."

"ఏమిటి యమునా! ఇవాళ కొత్తగా మాట్లాడుతున్నావ్"

"నిజమే మాధవ్! ఈఇంట్లోఅందరూ కొత్తగా ప్రవర్తిస్తున్నారు. నీతో సహా",

"ప్లీజ్! కాస్త అర్థమయేలా చెప్పు యమునా"

"చెప్తాను, నిజం చెప్తావుగా"

"అలాగే చెప్పు! ఏమిటీ"

"నువ్వు అన్నంతిని ఎన్నాళ్ళయింది" సూటిగా అతని కళ్ళలోకిచూస్తూ అంది యమున.

గతుక్కుమన్నాడు మాధవ్.

"చెప్పు. నువ్వు అన్నంతిని ఎన్నాళ్ళయిందీ" రెట్టించింది యమున,

"ఎన్నాళ్ళానా! ఎన్నాళ్ళో ఏమిటి యమునా: రోజుతింటున్నాను. ఇవాళ మధ్యాహ్నం కూడా తిన్నాను. ఈ పూట మాత్రం పుష్కా పెసరట్టు తిన్నాను. ఎందుకలా అడిగావ్!"

"అబద్ధం" అరిచింది యమున.

"ఏమిటీ:"

"నువ్వు అన్నంతిని కనీసం మూడు రోజులయింది"

"మైగాడ్! మూడురోజులా! నేనామైనా స్వాములార్ననుకుంటున్నావా రోజులతరబడి భోంచెయ్యకుండా వస్తుండడానికి అయినా నా ఆకలి సంగతి నీకుతెలియదా. క్షణం ఆలస్యం అయితేఅరిటాకుకొనుకు తెచ్చుకొని "అన్నం పెడతారా పెట్టరా" అంటూ అమ్మగారి పీకలమీద ఎన్నిసార్లు కూర్చోలేదు !

"ఎందుకు మాధవా వృధాప్రయాస ! నువ్వు తిండి మానేశావ్ ! డబ్బుకూడ బెట్టి మాకోసం ఖర్చుచేస్తున్నావ్ ! అకలితో ముడుచుకు పడుకుంటున్నావ్ కానీ మాధవా ! ఇలాంటి ధాతృత్వం మేం భరించలేం"

"యమునా!"

"అవును మాధవా! చేతిలో పైసా లేదు. తిండిలేదు. పోనీ ఆకలయినప్పుడు మునుపట్లా వచ్చి అమ్మని అడక్కూడదా? పట్టెడన్నం పెట్టలేని స్థితిలో వున్నామనుకున్నావా, లేకపోతే వీళ్ళనడగడమేమిటనుకున్నావా"

"ఇదెక్కడి గొడవ యమునా ! నేను రెండుపూటలా అయ్యర్ హోటల్లో భోంచేస్తున్నాను. ఇవాళ మధ్యాహ్నం వంకాయకూర చాచిమరీ వేశాడు నాకు, అంతేనా ఒద్దుమొర్రో అన్నా వినకుండా మలబారు అప్పడాలు చాలా ధావుంటాయంటూ బలవంతంగా తినిపించాడు.

ఏమాటకామాటేచెప్పుకోవాలి అయ్యర్ వంటబ్రహ్మాండంగా వుంటుంది,అక్కడ పనిమానేస్తే మాత్రం నేను భోజనానికి రాకపోతే పనివాడిలా అలుగుతాడు. ఇవాళ మధ్యాహ్నం పొందారు బోస్తూ..."

[ఇంకావుంది]

## క్వారీ కాంట్రాక్టర్ల సమస్యలు

స్టోన్ క్వారీ కాంట్రాక్టర్లలోరాష్ట్ర 9మంతటా నూటికి 90మంది చదివారు. స్టోన్‌క్వారీ యజమానులమీద సుమారు పన్నెండు ప్రభుత్వ డిపార్టుమెంటులు పెత్తనం చేస్తున్నాయి. అందుచే వీరికి ఎంత ఇబ్బంది కలుగుతుందో ఎన్ని సమస్యలు ఉత్పన్నమవుతాయో తెలియనిదికాదు. అన్నిటికంటె ముఖ్యమైన సమస్య సీనరేజ్ సెస్ వీరు దీనిని ఎగవేస్తున్నారా: ప్రభుత్వమునకు ఇది జమపడుతున్నదా- లేదా అనేది ప్రధాన సమస్య.

స్టోన్‌క్వారీ మెటల్ కావి, క్రషరు చిప్స్ కాని నూటికి 90 శాతం గవర్నమెంటు డిపార్టుమెంట్లకే తోలుతారు. సుమారు 10శాతం మాత్రమే ప్రయివేటు వ్యక్తుల గృహ నిర్మాణమునకు తదితర పనులకు వాడుతారు. ఆ 10 శాతం కూడా కమ్మర్షియల్ టాక్సెస్ చెక్‌పోస్టులు వున్నవి కనుక బిల్లులతో పోతాయి. అందువల్ల సీనరేజి సెస్ సేల్సుటాక్స్ కట్టవలసిందే. తరువాత ప్రభుత్వ డిపార్టుమెంటులకు వెళ్లేమెటల్‌కు కాంట్రాక్టరు బిల్లులో సీనరేజ్ సెస్ ప్రభుత్వం మినహాయించుకొంటున్నది అయినప్పటికీ క్వారీ కాంట్రాక్టర్లు, క్రషరు యజమానులు మైన్స్ అండ్ జియాలజీ డిపార్టుమెంటు వారిచ్చిన పర్మిట్లు ప్రవేశార్థికి వ్రాయుచున్నారు. అందువల్ల సీనరేజిసెస్ రెండు పాయింట్లలో జమపడుతున్నది. అనగా ప్రభుత్వ ఉద్దేశ్యం ప్రకారం వంద రూపాయలు సీనరేజి సెస్ విధిస్తే రెండు వందలు జమపడుతున్నది. తరువాత క్వారీ పూర్తిగా ఉపయోగించుకోలేని వారు డెడ్‌రెంటు తప్పనిసరిగా చెల్లించాలి.

తరువాతపైవివరం ప్రకారంసీనరేజీ సెస్ 100 శాతం ప్రభుత్వమునకు జమపడుతున్నది. అయినప్పటికీ డెడ్‌రెంట్ అని అనకుండా హెక్టారుకు రెండు సంవత్సరములకు రు. 5,000 డెడ్‌రెంట్ రు 1.850 సెస్ వసూలు చేయవచ్చును. ఇంకను ప్రభుత్వము చావిస్తే రు. 6-850రెండు సీనరేజీ కలిపి రు 14,000 వసూలు చేసినను బాగానే వుంటుంది. ఎందుకంటే వీరిమీద ప్రభుత్వం నుంచి అవాంఛనీయమైన వత్తిడి లేకుండాపోతుంది. ప్రభుత్వమునకు రావలసిన దానికన్నా ఎక్కువ ఆదాయం వస్తుంది.

ఒకసారి వెనుక సీనరేజి+సెస్ ఇప్పుడు ఎట్లున్నదీ అవలోకించుదాము, 1987 జూన్‌కు వెనుక.

1. డెడ్ రెంట్ 1000 + సెస్ 370
2. ఇప్పుడు డెడ్‌రెంట్ 5000 + సెస్ 1850
3. వెనుక క్యూబిక్ మీటర్ సీనరేజి రు. 1.75 + 0.65 సెస్
4. ఇప్పుడు రు. 10/- + 3-70 సెస్.

పై వివరణనుబట్టి సీనరేజి సెస్ 5రెట్లు పెరిగినవి, పెరిగినప్పటికీ ప్రస్తుతరేట్లప్రకారమే గవర్నమెంట్‌కు జమపడుతున్నమాట విదితమే. పర్మిట్లు తీసేస్తేఅనవసరపు వత్తిడి, అమాయకులైన క్వారీ కాంట్రాక్టర్లమీదఉండదు.

ఇక్కడ ఒక జటిలసమస్యవున్నది. తోలుకున్న కాంట్రాక్టరుకు, క్వారీ కాంట్రాక్టరు ఎం. ఆర్. సి. సి. ఇవ్వవచ్చును. అదిఇచ్చినపుడు ప్రభుత్వము మెటలుకు సంబంధించిన సీనరేజీసెస్ తాలూకా మొత్తమునుమినహాయించుటకు వీలులేదు, అప్లై పూర్తిగా పర్మిట్లు డెడ్‌రెంట్‌కు మించి వ్రాసి పూర్తిగా క్వారీని వాడుకున్నప్పుడు తీసే డెడ్‌రెంట్‌కు కట్టేవనిలేదు. అలాకాక పర్మిట్లు రద్దుచేస్తే, ప్రభుత్వము ఉద్దేశించిన సీనరేజీసెస్‌కు అదనంగా రెంటు కూడా వస్తుంది, కొందరు క్వారీలీజుకు తీసుకొని ఖాళీవుంచకుండా ప్రస్తుతపు పెరిగిన డెడ్‌రెంటును సీనరేజీని రెండు రేట్లు చేస్తే బాగావుంటుంది. చట్టమును చేతిలోకి తీసుకోని ప్రస్తుతము కృష్ణా జిల్లాలో 3,4 గ్రామ సర్పంచులు క్వారీచెక్‌పోస్టులని ఏర్పాటు చేసినారు. రాష్ట్రమంతటా పంచాయితీంచే చెక్ పోస్టులు ప్రభుత్వము పెట్టించునని ఊహాగానములు సాగుచున్నవి. అదే నిజమయితే యిప్పుడు అజమాయిషీ చేస్తున్న పన్నెండు డిపార్టుమెంటులకు తోడు మరోడిపార్టుమెంటు వస్తున్నది. అజమాయిషీ పెరిగిన కొలదీ అవినీతి పెరగడంసహజం. తరువాత పంచాయతీల ఆధీనములోనికి రాగానే స్థానిక పార్టీ- వ్యక్తి- ముఠాతగాదాలు చోటు చేసుకుంటాయి. అందుచే ప్రభుత్వము డైరెక్టు వసూళ్ళకు తలపడక కాంట్రాక్టరు బిల్లులో సీనరేజ్ సెస్ మినహాయించుకొనుట మంచిది. మైన్స్ అండ్ జియాలజీ పర్మిట్లు రద్దు చేయుట వలన స్వచ్ఛమైన పాలన ఏర్పడుతుంది.

గత కొద్దిసంవత్సరాలుగా ప్రభుత్వం రోడ్లకు మెటలింగ్‌కాని, బి.టి.లు గాని చేయించటంలేదు. అందుచే స్టోన్ క్వారీ మెటలు, క్రషరు చిప్సుకొనుగోలు దాదాపు ఆగిపోయి క్రషరు యజమాని క్వారీ కాంట్రాక్టర్లు లేబర్‌కు బట్వాడా చేసే స్థితిలోలేక అప్పులపాలై దిక్కుతోచని స్థితిలోవున్నారు. మెటలు తోలటము ఆగిపోగానే తరువాత పనిచేయుటకు క్వారీస్థలముచాలదు, అమ్ముకోనిదే లేబర్ బట్వాడా చేయడానికి డబ్బువుండదు, అలాంటి పరిస్థితి ఏర్పడినప్పుడు అడ్వాన్సు తీసుకున్న క్వారీలేబర్ పని వదలి వెళ్ళిపోతారు, యిచ్చినఅడ్వాన్సు కూడా తిరిగిరాదు.

పరిస్థితి ఇంతగా విషమించిన యీ సమయంలో ప్రభుత్వము తొందరపడి క్వారీ, క్రషరు యజమానులను సంప్రదించకుండా ఎలాంటి చర్యతీసుకోరాదు

—నాదెండ్ల సత్యనారాయణ

సరదా-పరదా!! —రవీంద్ర

ఏంట్సార్!! అలా వున్నారు

ఆ చిరిగి పోయి ప్రెసెంటార్!! ఇనకం టాక్సోళ్ళొస్తా మన్నారా??

ఏం చెప్పమంటారు సార్ నా బాధ!!

కానీ ఈ డ్రెస్ వేసింతర్వాతనాలసి వివరాలు పెల్లడి చెయమని ఎవ్వడూ అడుగట్లేదు......

# విపుల భారతం

## మళ్లీ సర్దుబాటు యత్నాలు

ప్రభుత్వాలలోని నాయకుల కుంభకోణాలో, అవినీతి కార్యక్రమాలో బయటపడినప్పుడు లేదా, ఆపార్టీ విధానాలపట్ల ప్రజలలో విముఖత ఏర్పడినప్పుడు తమపార్టీ ఉనికిని కాపాడుకోవడానికి ఆపార్టీతో పొత్తుపెట్టుకున్న ఇతర పార్టీ తాత్కాలికంగా కొంచెం దూరంగా ఉండడం, ఆ తర్వాత మళ్ళీ చేతులు కలపడం సహజమైన విషయం.

ఈమధ్య బెంగాల్‌లోచెలరేగిన బెంగాల్ బల్బులవివాదం అక్కడి పాలక పార్టీలకు అనేక చిక్కులు తెచ్చిపెట్టింది. ఈ బెంగాల్‌బల్బుల వివాదంతోపాటు మరికొన్ని ఇతర తగాదాలుకలసి అక్కడ వామపక్ష ఫ్రంట్‌లోని భాగస్వామ్య పార్టీలమధ్య సంబంధాలు బెడిసికొట్టేట్లు చేశాయి. సి పి ఎం,ఆర్ ఎస్ పిలు ఈ సంఘటనలో భాగస్వాములుగా ఉన్నాయి. ఈపార్టీలమధ్య దెబ్బతిన్న సంబంధాలను మెరుగుపరచుకోవడానికి ఇరుపక్షాల మధ్య కొత్తగా ఉన్నతస్థాయిలోప్రయత్నాలు సాగుతున్నాయి.

ఇందులో భాగంగానే మొదట ఆర్.ఎస్.పి. కార్యదర్శి శ్రీ నాని భట్టాచార్య రాష్ట్రకమిటీ సీనియర్ సభ్యుడు శ్రీ నిఖిల్‌దాస్‌తో కలసి ముఖ్యమంత్రి శ్రీ జ్యోతిబసుతో సిపిఐం రాష్ట్ర కార్యదర్శి సంఘటన అధ్యక్షుడు శ్రీ సరోజ్ ముఖర్జీతో ఈమధ్య చర్చలు జరిపారు. ఈ చర్చలను వారు "ద్వైపాక్షిక విషయాల"పై చర్చగా అభివర్ణించారు.

అంతేగాక ఈ రెండుపార్టీల మధ్య ఉన్న స్వల్పమైన విభేదాలను పరిష్కరించుకోవడానికి ఇరుపార్టీల నాయకులు మరోసారి కూర్చొని చర్చించుకోవాలని కూడా అనుకున్నారు.

ఇదిలా వుండగా ఫ్రంట్‌వర్గాలు పునర్గహణ 'చర్చలను' ఆహ్వానిస్తుండగా గత ఒకటిన్నర మాసాలలో మారిన పరిస్థితులను బట్టి ఈ ఐక్యమత్య ప్రయత్నాలు సాఫీగా సాగుతాయనేది సందేహంగానే ఉంది. మరీ ఇటీవల రెండు పార్టీల కార్యకర్తల మధ్య కొట్లాటలు జరిగి ముర్షిదాబాద్‌లో నలుగురు సిపిఎం కార్యకర్తలు మరణించిన తర్వాత ఈ సందేహం మరింతగా బలపడుతోంది.

బెంగాల్ బల్బుల దుమారం సద్దుమణిగినప్పటికీ సిపిఎం ఆర్‌ఎస్‌పిల మధ్య వాగ్యుద్ధం కొనసాగుతూనే ఉంది.

ఇటీవల జరిగిన సి.పి.ఎం పార్టీ జిల్లా సభలో ముర్షిదాబాద్‌లో ఆర్.ఎస్‌పి రాస్తారోకో ఉద్యమాన్ని చేపట్టడంవల్ల ముఖ్యమంత్రి శ్రీజోతిబసు ఆర్‌ఎస్‌పిని దుయ్యబట్టాడు. ఆర్‌ఎస్‌పి నుంచి ఇటువంటి పద్ధతులను కాంగ్రెస్ కూడా నేర్చుకుంటున్నదని ఆయన అన్నారు.

ఆర్‌ఎస్‌పి తన అధికార వారపత్రిక "గణవార్త"లో ఫ్రంట్ ప్రభుత్వాన్ని విమర్శిస్తూ సుదీర్ఘమైన సంపాదకీయాలు రాయడం సాగిస్తూనే ఉంది, ఫ్రంట్ ప్రభుత్వంలోని కొన్నశాఖలలో అవినీతి చీడ అల్లుకుపోయిందని ఫ్రంట్ తనను తాను ఒక ప్రజా ఉద్యమంగా మలుచుకోవడంలో విఫలమయ్యిందని తీవ్రంగా విమర్శిస్తోంది.

ఇదిలా ఉండగా ఈనెల మొదట్లో జరిగిన సిపిఎం రాష్ట్ర మహాసభలలో ఆమోదించిన ఒకతీర్మానాన్ని అంగీకరించడానికి ఆర్.ఎస్.పి. నిరాకరించింది. ఫిబ్రవరిలో జరిగిన పంచాయితీ ఎన్నికలలో సీట్లసర్దుబాటు విషయంలో ఒక అవగాహనకు రాలేకపోవడంవల్ల ఫ్రంట్‌లో ఏర్పడిన ప్రతిష్టంభనకు కొందరు ఫ్రంట్ భాగస్వాములు కారణమని సి పి ఎం ఆతీర్మానంలో ఆరోపించింది.

అయితే ఇందుకు బాధ్యులైనవారిని ఆ తీర్మానంలో స్పష్టంగా పేర్కొన్నప్పటికీ సి పి ఎం ఒకవైపు ఫార్వర్డ్‌బ్లాక్ ఆర్ ఎస్ పిలు మరోవైపు సీట్ల సర్దుబాటుకోసం కీచులాడుకున్న మాటవాస్తవం.

సి. పి. యం. అభ్యర్థులకు వ్యతిరేకంగా పోటీ చేసిన లెఫ్ట్ ఫ్రంట్ పార్టీలు మరోసారి ఘోరపరాజయం చెందాయని గత పంచాయితీ ఎన్నికలు ఋజువుచేశాయని తీర్మానంతో పేర్కొన్న అంశాన్ని కూడా ఆర్.ఎస్.పి. తీవ్రంగా నిరసించింది.

"దీనినుంచి మనం తీసుకోవలసిన ఏకైకగుణపాఠం ఏమంటే కాంగ్రెస్ పార్టీకి వ్యతిరేకంగా తమ పార్టీతో ఐక్యం కాకపోవడమంటే ఆయా పార్టీలు తమకు తాము ద్రోహం చేసుకోవడమేగాక, వామపక్ష ఫ్రంట్‌కు కూడా ద్రోహాన్ని చేయడమేనని" సి పి ఎం తీర్మానం పేర్కొంది.

ఏది ఏమైనప్పటికీ ఈ చర్చలు జరుపుతున్నపార్టీలలో పదవీవ్యామోహం ఉండడమే వారిమధ్య సంబంధాలు బెడిసికొట్టడానికి కారణమని రాజకీయ పరిశీలకులు అంటున్నారు

## శి.గు.ప్ర.క చిక్కుసమస్య

ఇప్పుడు శిరోమణి గురుద్వారా ప్రబంధక కమిటీకి పెద్దచిక్కు సమస్య ఎదురు అయింది, అయిదుగురు శిక్కుమత ప్రధాన ఆచార్యులలో, తఖ్ కేష్ ఘర్ జతేదార్అయిన గ్యానిబల్‌బీర్ సింగ్‌ను ఉగ్రవాదులు హతమార్చారు. హర్మిందర్‌సాహిబ్ ప్రధాన గ్రంథిజ్ఞాని మోహన్‌సింగ్, కెనడాలో స్థిరపడాలని వెళ్ళిపోయారు 6 నెలలు సెలవుపై వెళ్ళినట్లు అధికారికంగా పేర్కొంటున్నా నిజానికి ఆయన వీసాకోసంఢిల్లీలోని కెనడా హైకమీషన్‌కు మూడున్నర ఏళ్ళక్రిందటే దరఖాస్తు పెట్టుకొన్నారట. హర్మిందర్‌సాహిబ్‌కు బదిలీ అయ్యేముందు శ్రీ మోహన్‌సింగ్ అకాల్‌తఖ్ తాత్కాలిక జతేదార్‌గా వుండేవారు శిగుప్రక కార్యవర్గం, భాయ్ జస్‌బీర్‌సింగ్ నాయకత్వంలోని ప్రధాన అర్చకులను మే 30నతాలగించిందిలగాయతు ప్రధాన అర్చకులనూ, అర్చకులనూ తిరిగితిరిగి నియమించవలసి వస్తున్నది. డిసెంబరు 28న మళ్ళీనియమించడం 8వ సారి అవుతుంది. శ్రీమోహన్‌సింగ్ చిన్నకుమారుని జాడతెలుసుకోటంకై ప్రయత్నిస్తామని హామీలభించటంతో ఆపరేషన్ "బ్లాక్ థండర్" తర్వాత మే 22న స్వర్ణాలయం "మర్యాద" శ్రీ మోహన్‌సింగ్ పునరుద్ధరించారు, ఆయనకు ఉగ్రవాదుల బెదిరింపు తీవ్రం అయింది.

గవర్నర్ శ్రీ రేగాని డి జి పి అయిన శ్రీ కె పి ఎస్ గిల్‌గానీ, తన చిన్న కుమారునిజాడ తెలుసుకోవటంలో తోడ్పడలేదని శ్రీ మోహన్‌సింగ్ కెనడావెళ్ళిపోతూ తన బాధను వ్యక్తంచేశారు

అయితే శిగుప్ర కమిటీ ఎదుర్కొన్న సమస్య ప్రధాన అర్చకులతో ఖాళీఅయిన రెండుస్థానాలలో ఎవరి నియమించటం అని: ఉగ్రవాదుల ఒత్తిడి వలన ఎవరూ అపదవులకు ముందుకు రావటంలేదు.

## ప్రజాసేవా కండూతి

ప్రజాసేవ చేయాలంటే పదవివుండాలి అదిలేకుండా ప్రజాసేవ చేయటానికి ఎలాగో కాంగ్రెసువారికి పాలుపోవటంలేదు ప్రజలకు సేవచేస్తూ. ఇహమూ పరమూ చూసుకోవాలనే కండూతి మాత్రం తీవ్రంగా వుంది మహారాష్ట్రలో ఒకరిద్దరిని మినహాయిస్తే అందరికీ ప్రజాసేవ చేద్దామనే ఆరాటమేమరి ముఖ్యమంత్రి శ్రీ శరద్ పవార్‌ను చూద్దామంటే పదవులన్నీ అస్మదీయ వర్గానికే పంచిపెట్టారు. మొన్నటిదాకా ప్రత్యర్థుల శిబిరంలోవుండి కాంగ్రెస్ (ఐ) ని తిట్టిపోసిన ఈ పెద్దమనిషి మళ్ళీ కాంగ్రెస్ (ఐ) తీర్థం తీసుకొని ఏకంగా ముఖ్యపీఠాన్నే అధిష్టించడం కొందరికి ఆదినుండి అయిష్టంగానే వుంది అయిష్టం సంగతి ఎలావున్నా పదవులన్నా తమకిచ్చారా అంటేఅదీ లేదు. కష్టకాలంలో పార్టీనే నమ్ముకొని కాంగ్రెస్(ఐ)కి మహారాష్ట్రలో ప్రాణంపోసిన"ఇందిరా విధేయుల"కు ఇదా ప్రతిఫలమంటూ అసమ్మతి తెలిపారు. అసమ్మతి వర్గానికి నాసిక్‌రావు తిర్పుడేనాయకత్వం వహించారు ఇటీవల అసమ్మతివాదులంతా నాగపూర్‌లో సమావేశమై "పదవులులేని దయనీయస్థితి"పై ఒకరినొకరు ఓదార్చుకున్నారు. పెద్దరొట్టెలన్నీ శ్రీశరద్‌పవార్ తనవారికిచ్చుకున్నా, చిన్నముక్కలన్నా తమకు పడవేయలేదని దు:ఖించారు. ప్రజలకు సేవచేసి తరించే సమయంలో వ్యర్థమైపోతున్నదని విచారపడ్డారు.

అసమ్మతివాదులసమావేశానికి హాజరైన మరోప్రముఖవ్యక్తి మాజీముఖ్యమంత్రి శివాజీపాటిల్ నీలంగేకర్. ఈయన తనకుమార్తె మార్కులవిషయంలో మేలు చేయబోయిపదవిని పోగొట్టుకున్నాడు. హైకోర్టు తీర్పును సుప్రీంకోర్టు కొట్టివేసింది గనుక మహారాష్ట్ర కిరీటం తిరిగి తనకేదక్కాలని అంటున్నాడు నీలంగేకర్, తాను నాయకుడని విశ్వసించిన వసంతదాదా పాటిల్‌కూడా తిరిగి తనకు కిరీటం యిప్పించలేకపోయారని బాధపడ్డారు.

ఆహా ! మహారాష్ట్ర కాంగ్రెస్ నాయకుల ప్రజాసేవకు ఎంతగా తపించుపోతున్నారో.

దేవుడు సర్వాంతర్యామి. ఆయన అతీతుడే కావచ్చు! కాని అందుబాటులోనే వుంటాడు ఈ సత్యాన్ని కళ్ళముందు పెట్టేదే క్రిస్మస్. "ఇదుగో మీలో ఒకడినిగా, మీతోనే వున్నాను; మీ కష్టసుఖాల్లో పాలుపంచు కొంటున్నాను. నాకు మీరే కావాలి: మీ శ్రేయస్సే కావాలి" అనే ప్రేమదీక్షతో దేవుడు మానవరూపం ధరించిన రోజే క్రిస్మస్. అందుకే క్రీస్తు "ఇమ్మానుయేలు"

# క్రిస్మస్



అనే పేరును స్వీకరించాడు. ఇమ్మానుయేలు అంటే "దేవుడు మనతో నివసిస్తున్నారు" అని అర్థం.

"ఒక స్త్రీ తనబిడ్డను మరచి పోగలదా? ఒక తల్లి తన గర్భంలోని శిశువును విస్మరించగలదా? ఆమె మరచిపోయినను నేను మాత్రము నిన్ను మరువను, ఇదుగో చూడుడు; నేను నీ పేరును (ముద్రికను) నా అరచేతిలో చెక్కి పెట్టుకొన్నాను. పచ్చ పొడిపించుకొన్నాను. నేను నిన్ను విస్మరింపలేను (ఎసయా గ్రంథం 49:15) అని తన గాఢ ప్రేమను, సన్నిహితత్వాన్ని పదే పదే ప్రకటించాడు ఇమ్మానుయేలు.

ఆయన మానవరూపంలో అవతరిస్తాడు అని విశ్వసించారు. ఆతనికోసం ఆతురతతో నిరీక్షించారు. ఆ నిరీక్షణా ఫలమే క్రిస్మస్ మహాపర్వదినం.

క్రీస్తు అసలు పేరు ఇమ్మానుయేలు. మానవావతార మెత్తిన క్రీస్తు చేసిన ప్రతి చర్య, చెప్పిన ప్రతిమాట దేవుడు మనతోనే నివసిస్తూ మన కష్టసుఖాల్లో పాలుపంచుకొంటున్నాడు అనే సత్యాన్ని ప్రకటించింది.

అయితే అంత అనురాగాన్ని ప్రదర్శిస్తూ అహర్నిశలు అండదండగా వుంటున్న దేవుని మానవుడు దర్శించాలంటే ఈ మన లౌకిక బాధ్యతలను విడిచిపెట్టి, ఏ అరణ్యానికో వెళ్ళి ముక్కుమూసుకొని తపోదీక్షలో వుండాలని ఆయన ప్రబోధించలేదు. ఆయన్ని దర్శించాలంటే, ఆయన ఇమ్మానుయేలు కనుక, ప్రతి మానవునిలో, ప్రతి సృష్టిలో ఆయన్ని భక్తితో వెదకాలి.

కనుక క్రిస్మస్ అంటే మనతో నివసిస్తున్న భగవంతుని విశ్వసించడం, ఆయన స్వరూపాన్ని పరులలో తిలకించడం అంటే క్రిస్మస్‌ను అర్థం చేసుకోవాలంటే హృదయం కావాలి; హృదయంలో నుండి ఉద్భవించే భక్తి, నిరీక్షణ, దైవాన్వేషణలు కావాలి. "నిర్మల హృదయులు ధన్యులు, వారు దేవుని దర్శింతురు" అని యేసు క్రీస్తు సెలవిచ్చాడు. అంటే మనసులో అహంకారం, స్వార్థం, అసూయా, కామం, క్రోధం, లోభం మొదలైన దోషాలు లేకుండా వుండాలి. చిత్తశుద్ధితో ప్రేమానురాగాలతో మంచి కోర్కెలతో ఆ భగవంతుని కోసం తపించాలి. అల్పులలో, దీనులలో, అణగ ద్రొక్కబడుతున్న వారిలో, పగవారిలో కూడా ఆ భగవంతుడు దర్శనమిస్తాడు. తాను ఇమ్మానుయేలు అని ప్రబోధిస్తుంటాడు.

ప్రేమమూర్తి క్రీస్తు ప్రభువుకు సుమాంజలులు సమర్పించి తరిద్దాం,

- ఫాదర్ జయబాలన్

(సొసైటీ ఆఫ్ జీసస్)

# బ్యూటిఫుల్ బర్డ్స్



వార్బ్లెర్ పిట్ట చాల చిన్నది. కూత మాత్రం ఘనమైంది. అతి వింతైన ధ్వనులను చేయడంలో దీనికి ఇదే సాటి. ఈ ధ్వనులు దీని ముక్కు ద్వారా వెలువడడం చిత్రంగా తోచవచ్చు. ఇప్పటికీ ఈ అంశాన్ని గురించి ఇంకా పరిశీలనలు జరుగుతూనే ఉండడం విస్మయాన్ని కలిగించవచ్చు.

అయిదు అంగుళాల పొడవు ఉండే ఈ పిట్ట తన విన్యాసాల ద్వారా గిరిడీలు కొడుతూ చూపరులను ఇట్టే ఆకట్టుకుంటుంది. తరువాత తన కమ్మటి గొంతు ద్వారా ఇక ఎవరినీ కదల నివ్వకుండా ఆకర్షిస్తుంది. ఈ పిట్ట రంగు కూడా చిత్రంగానే ఉంటుంది. పై భాగమంతా గోధుమ, బూడిద కలగలిపిన మిశ్రమ వర్ణంలో ఉంటుంది. ఉదరభాగం చూస్తే పాల మీగడ లాగా తెల్లగా ఉంటుంది. కళ్ళు స్ఫుటంగా ఎర్రగా ఉండడం గమనించదగ్గ అంశం. పోతే కాళ్ళు కూడా లేత గులాబీ రంగులో ఉండడం గమ్మత్తుగా అన్పిస్తుంది. ఈ పిట్ట తోక కూడా భలే పసందుగా ఉంటుంది. చిత్ర వర్ణాలతో కూడుకున్న ఈకలు ఈ పిట్టకు కొత్త అందాలను ప్రసాదిస్తాయని చెప్పవలసి వస్తుంది.

ఈ పిట్టలు పంట పొలాలలో, పండ్ల తోటలలో, పచ్చిక బయళ్ళలో, చెరువు గట్ల మీద, టెలిఫోన్ తీగల మీద, గుళ్ళ లోపలి ధ్వజస్తంభాల మీద- తిరుగాడుతూ ఎంతో చురుకుగా కనిపిస్తూ ఉంటాయి. ఇవి ఎక్కడికీ వలస వెళ్ళవు. భారత్, బంగ్లాదేశ్, పాకిస్తాన్, శ్రీలంక- ఈ దేశాలలో ని అన్ని ప్రాంతాలలో నూ ఈ పిట్టలు దర్శనమిస్తాయి.

ఆడ, మగ పిట్టలను గుర్తు పట్టడం అంత తేలిక కాదు కాని ఘనమైన కూత మగపిట్టకే ఉంటుందని మాత్రం శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. శీతాకాలంలో ఈ పిట్టలు జతలు కడుతూ బహు హుషారుగా తిరుగాడుతుంటాయి. మార్చి నెల నుంచి గూళ్ళు కట్టుకోవడం మొదలెడతాయి కాని జులై మాసానికి ఎక్కువ సంఖ్యలో గూళ్ళు కనిపిస్తూ ఉంటాయి. ఈ



రచన – శ్రీరమేశ
బొమ్మలు – సారధి

పిట్టలు గూళ్ళు కట్టుకోవడంలో అంతగా ఆరితేరినవి కావు. పైగా శత్రువుల బారి నుంచి తప్పించుకునే శక్తి, లాఘవం, చాకచక్యం- ఇలాంటివి కూడా- ఈ పిట్టలకు తక్కువే అని చెప్పవచ్చు.

ఈ పిట్టలు దఫాకి 3–4 గుడ్లని పెడతాయి. ఇవి అండాకారంలో ఉండి ఇటుక ఎరుపు రంగులో ఉంటాయి. ఆడ, మగ, పిట్టలు రెండూ ఈ గుడ్లను పొదగడంతో పాలు పంచుకుంటాయి. 10–11 రోజులకు గుడ్లు చితికి పిల్లలు బయటికి వస్తాయి. ఇవి లేత గోధుమ రంగులో ఉంటాయి. కొట్టొచ్చినట్లు కన్పించే కళ్ళు, తోక- వీటికి ప్రత్యేక అందాన్ని ఇస్తూ ఉంటాయి.

ఈ పిట్టలు కాయలను, పండ్లను, ధాన్యపు గింజలను, క్రిమికీటకాదులను ఇష్టంగా సేవిస్తాయి. ఈ పిట్ట గొంతు ఎంతో చిన్నదిగా ఉన్నా, శబ్దం మాత్రం కంచులాగా వెలువడడం ఏ విధంగా సాధ్యమా అని ఇప్పటికే శాస్త్రవేత్తలు ఆలోచిస్తూనే ఉండడం గమ్మత్తుగానే తోచినా- ప్రకృతి ఎంత గొప్పదో మనకు తెలిసి వస్తుంది!

(ఇంకా ఉంది)





# కలిసొచ్చిన 'బేబీ ఆస్టిన్'



ఈ చిత్రంలో కనపడుతున్న కారుకు గొప్ప చరిత్రవుంది. గొప్పగొప్ప సినీస్టార్స్, రాజకీయవేత్తలు, కవులు, పండితులు, ఈ కారు ఎక్కారు. ఈ కారులో ఒక్కసారి ఎక్కితే చాలు, వారి పంట పండుతుందిట. చాలామందికి ఈ నమ్మకంవుంది.

## నమ్మకాలూ గారడీలు

యు.పి.సి 455 నంబరు గల ఈ బేబీ ఆస్టిన్ 1931 మోడల్. అయినా యిప్పటికీ అలహాబాద్ రోడ్లవెంట రయ్యిమని దూసుకుపోతుంది. కీ.శే. లాల్‌బహాదుర్ శాస్త్రి ఈ కారులో రాజకీయయాత్ర చేయబట్టే భారత ప్రధాని కాగలిగారని అందరూ చెప్పుకుంటారు. విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్ కూడా ఈ కారులో ప్రయాణంచేసినవారే;

ఇలాంటి కారే పండిత నెహ్రూకు వుండేది. దానిని చూట్టానికి నగరమంతా గుమిగూడేవారు. నెహ్రూగారికి ఒకమిత్రుడు వుండేవారు ఆయన పేరు వహల్ సాహెబ్. ఆయనవద్ద 'బేబీ ఆస్టిన్' వుంది. ఒకసారి వహల్‌సాహెబ్ తన మిత్రుణ్ణి బండి యివ్వమని అడిగితే ఆయన అందుకు నిరాకరించాడు. కానీ ఆయన సంకల్పబలంకొద్దీ ఆ రోజు సాయంత్రమే 'బేబీ ఆస్టిన్' వహల్ సాహెబ్ యింటికి చేరుకుంది. ఏమయిందంటే, బేబీ ఆస్టిన్‌లో స్వాతంత్రయోధులు ఆయుధాలు చేరవేస్తున్నారని ఇంగ్లీషువాళ్ళకు వార్త అందింది. దాంతో ఆయన భయపడి ఈ కారు వహల్ సాహెబ్‌కు యిచ్చేసారు.

1949లో వహల్ సాహెబ్ ఈ బండిని సేఠీ సాహెబ్‌కు యిచ్చారు. సేఠీ సాహెబ్ అసలు పేరు ఓంకార్ ప్రసాద్ భార్గవ్. ఆయన ఎప్పుడూ ఈ బండిని బయటకు తీయరు. ఎప్పుడైనా మిత్రుల బలవంతం మీద బయటకుతీస్తారు.

ఈ కారులో సుమిత్రకాంత్ పంత్, హరివంశరాయ్ బచ్చన్ లాంటి కవులు, శ్యామ్ బెనగల్, పద్మాఖన్నా, ఆర్.డి. బర్మన్, ప్రాణ్ లాంటి సినీస్టార్స్ ప్రయాణంచేశారు. ఎప్పుడైనా మిత్రులు బలవంతంపెడితే పెళ్లి వూరేగింపుకు సేఠ్‌గారు ఈ కారు యిస్తుంటారు. ఇప్పటికీ అలహాబాద్‌లో ఈ కారు రోడ్డువెంట పరుగుతీస్తుంటే కొంతమంది ఆశ్చర్యంగా మరికొంతమంది వ్యంగ్యంగా మాట్లాడుకుంటుంటారు.

— అపరాజిత




# పెళ్ళిచూపులు

అశ్వని

కథాకుసుమం

"ఘొరంగా నిట్టూరుస్తున్నట్లుగా శబ్దం చేస్తూ రైలు వచ్చి స్టేషన్‌లో ఆగింది. ముందు రామ్మోహనరావుగారు, ఆయన వెనుక సురేంద్ర రైలు దిగారు. తమను రిసీవ్ చేసుకోడానికి ఎవరైనా వచ్చేరేమోనని ఒకసారి చుట్టూ పరికిలనగా చూసారు. రామ్మోహనరావుగారు.

స్టేషన్ బయటకు వచ్చి, అక్కడ ఉన్న ఒకే ఒక్క రిక్షాను బేరమాడబోయి బేరం కుదరక నడచిపోవడానికి దూరాభారమన్న సంగతి తెలియడం చేత, చేసేదేమీలేక, చివరకు ఆ రిక్షావాడి 'మోనోపలీ'కి తల వంచి, అదే రిక్షాలో ఎక్కికూర్చున్నారు. రిక్షావాడు విజయ గర్వంతో సన్నగా కూనీరాగం తీస్తూ రిక్షా నెమ్మదిగా తొక్కసాగాడు. తనకేమీ తొందరలేదన్నట్టుగా. రిక్షా స్టేషన్ రోడ్డు విడిచి ఊరివైపు సాగిపోతుండగా ఆలోచనల్లోకిజారుకున్నాడు, సురేంద్ర.

తన పెళ్ళిచూపులకు ఇలాసింపుల్‌గా వెళ్ళడం ఎంత మాత్రమూ ఇష్టంలేదు. సురేంద్రకు. స్నేహితులతో, బంధువులతో, కలిసి సరదాగా వెళ్ళాలనుకున్నాడు. కాని, 'అమ్మాయి నచ్చవలసిందినీకు. ఆపై విషయాల నచ్చవలసిందినాకు! అందరూ ఎందుకు ప్రయాణ ఖర్చులు దండుగ' అంటూ తన కోరికను కొట్టిపారేశాడు తండ్రి. పెళ్ళిచూపులకు తామిద్దరే వెళ్ళవలసిరావడం నిరుత్సాహం కలిగించినా తండ్రిమాటకు ఎదురు చెప్పలేక మౌనం వహించాడు, సురేంద్ర. తనకు డిగ్రీ పూర్తయిన వెంటనే ఉద్యోగం రావడంతో అంతవరకు అందుకోసమే కాచుకొని కూర్చున్నట్లుగా తండ్రి హడావుడిగా తనకు పెళ్ళి ప్రయత్నాలు ప్రారంభించాడు. తత్ఫలితమే ఈ పెళ్ళిచూపులు!

పెళ్ళిచూపులంటే మనసులో ఒకవైపు ఉత్సాహంగానే ఉన్నప్పటికీ, పెళ్ళిచూపులకు వెళ్ళడం ఇదే మొదటిసారి కావడంతో మరో వైపు మనసులో ఆదోవిధమైన కంగారుగాను ఉంది సురేంద్రకు. పెళ్ళిచూపుల తతంగం ఏ విధంగా ఉంటుందన్నది. 'అనుభవజ్ఞులైన' స్నేహితులు అతడికి ముందుగానే బోధించినప్పటికీ అతడిలోని కంగారు పోలేదు. పెళ్ళిచూపులలో ఏ విధంగా ప్రవర్తించాలి, అమ్మాయిని ఏ యే ప్రశ్నలు అడగాలన్నది. గత రెండు రోజుల నుండి మనసులోనే రిహార్సల్స్ వేసుకుంటున్నాడు సురేంద్ర. అయినా కంగారు తగ్గలేదతడిలో. మొదటిసారిగా పెళ్ళిచూపుకు వెళ్ళే వాళ్ళెవరికయినా ఈ విధమైన కంగారు తప్పదేమోననుకున్నాడు సురేంద్ర.

చిన్న కుదుపుతో రిక్షా ఆగడంతో ఆలోచనల నుండి బయట పడ్డాడు సురేంద్ర. ఇల్లు వచ్చేసింది.

ఇంటి యజమాని ప్రసాదరావుగారు వారిని చూస్తూనే ఎదురువచ్చి వారిని సాదరంగా లోనికి ఆహ్వానించారు. ఆయనకు ఇంచుమించు నలభై అయిదు సంవత్సరాలుంటాయి.

ఆరోజున పెళ్ళిచూపులకు వస్తున్నట్లుగా రామ్మోహనరావుగారి నుండి ముందుగానే వర్తమానం రావడం చేత వచ్చిన వారెవరయినదీ ఆయనకు ఊహించడం కష్టం కాలేదు తన ఆహ్వానాన్ని మన్నించి పెళ్ళిచూపులకు వచ్చినందుకు వారికి పదేపదే కృతజ్ఞతలు చెప్పుకున్నాడాయన అంతవరకు గుమ్మంలో ఉండి తమను అనుసరించి లోపలికి వచ్చిన యువకుడిని తన సోదరుని కుమారునిగా పరిచయం చేసాడు ప్రసాదరావుగారు. ఆ యువకుడు తమ వంక ఆదోవిధంగా చూడటం ఇబ్బందికల్గించింది సురేంద్రకు. ఆ యువకుడు తమ వంక ఎందుకా విధంగా చూస్తున్నాడో అర్థం కాక ఠికమక పడ్డాడు సురేంద్ర.

ప్రసాదరావుగారు, ఆ యువకుడు తప్ప అక్కడ ఆ సమయంలో పెద్దలు మరెవరూ లేరు: పెళ్ళిచూపులు జరుగబోతున్న ఇంటిలో, ఉండవలసిన సందడి ఏదీ కనిపించలేదా, ఇంటిలో పెళ్ళిచూపులకు తామెంత సింపుల్‌గా వచ్చారో అంతకంటే సింపుల్‌గా ఆ ఇంటిలో ఏ సందడి లేక పోవడం సురేంద్రను అమితంగా ఆశ్చర్యపరచింది.

సుఖాసీనులై ఫలహారాలు సేవిస్తూ కబుర్లలో పడ్డారు రామ్మోహనరావుగారు. ప్రసాదరావుగారు, విజయవాడలో జరిగిన ప్రతిపక్షనాయకుల సమావేశం దగ్గర నుండి. మాస్కోలో ఇటీవలే జరిగిన అగ్ర రాజ్యాధినేతల సమావేశం వరకు రామ్మోహనరావుగారు ఏకధాటిగా చెప్పుకుపోతుంటే, తన ఒక్కగానొక్క కూతురి గుణగణాలు, అందచందాల గురించి మధ్య మధ్యన కల్పించుకొని వర్ణించి చెప్పసాగారు ప్రసాదరావుగారు.

వారి సంభాషణను మౌనంగా వింటూండిపోయాడు సురేంద్ర. అపుడపుడు ప్రసాదరావుగారు తన చదువు గురించి ఉద్యోగం గురించి అడుగుతున్న ప్రశ్నలకు ముక్తసరిగా సమాధానాలుచెబుతూ ఆ యువకుడు వారి సంభాషణలో పాలుపంచుకోవడం కాని, సురేంద్రతోమాట్లాడ్డంకాని చేయకుండా జరుగుతున్నతతంగానికి ప్రేక్షకుడిలా మిగిలిపోయాడు. అయితే, ఆ యువకుడు ప్రసాదరావుగారిని లోపలికి రమ్మన్నట్లుగా అపుడపుడు సైగలు చేయడం, అది చూసి కూడా చూడనట్లుగా ప్రసాదరావుగారు రామ్మోహనరావుగారితో సంభాషణ కొనసాగించడం సురేంద్ర గమనించినప్పటికీ దానిని పెద్దగా పట్టించుకోలేదతడు. ఒక విషయానికి మరొక విషయానికి పొంతన లేకుండా సాగుతున్న వారి సంభాషణ వినడం విసుగ్గా ఉంది సురేంద్రకు.

వచ్చిన పని మరచి ఏవేవోమాట్లాడుతున్న తండ్రి మీద, ఎంతసేపు కూతురి చదువు సంధ్యలు, తెలివితేటల గురించి చెబుతూ ఆమెను చూపించకుండా కాలయాపన చేస్తున్న ప్రసాదరావుగారి మీద ఎక్కడలేని కోపం వచ్చిందిసురేంద్రకు. 'ఆమె'ను చూడాలని అతడికి ఎంతో ఆతృతగా ఉంది, 'తన ఆతృతపెళ్ళికేమి తెలుస్తుంది? చూడవలసింది, పెళ్ళి కావ

# జన్మ ధన్యంబు

అత్యంత పుణ్యాన
ఆనంద భరితాల
ఆసేతు హిమాచలం
ఆబాలగోపాల ...
మేలుకొలుపు
కొందరోసిదు
పుట్టినరోజు పండుగ
ఓ! యేసుబాలా!
ఆ మతము, ఈ మతము
ఆ జాతి, ఈ జాతి
ఆవర్గ, ఈవర్గమను
వ్యత్యాసములేక
వ్యాకులతలులేక
సర్వసమ్మతమున
పరమత సహనమున
'క్రిస్మస్' పండుగను
జరుపుకొందురు
ఉపాసింప!
మీ గొప్పతనమునకు
ఇదియె నిదర్శనము
మము గెలుచునట్టి
మా జన్మధన్యం!

—కోట పాల్ దేవరాజు



లసించి తనకు కాని పిళ్ళకు కాదు కదా అనుకున్నాడు మనసులో.

చివరకు ఎలాగైతేనేం, అరగంట సేపు అనర్గళంగా సాగిన తన సుదీర్ఘోపన్యాసాన్ని తాత్కాలికంగాఆపి అమ్మాయిని తీసుకొని రమ్మన్నారు రామ్మోహనరావుగారు. "అన్నయ్యా" అనుకుంటూ సర్దుకొని కూర్చున్నాడు సురేంద్ర. ప్రసాదరావుగారు ఆ యువకుడికి సైగ చేసి అతడు వెంటరాగా వారిరువురూ లోనికెళ్ళారు.

ఇంతలో, లోపలికి వెళ్ళిన ప్రసాదరావుగారు, ఆ యువకుడు ఇవతలకు వచ్చారు. ఆయన,ఆయువకునిసాయంతో తీసికొని వస్తున్నదేమిటోవారికెదురుగా దానిని ఉంచేవరకు అర్థంకాలేదు సురేంద్రకు. బాగా వెడల్పుగా, నిలువెత్తు సైజులో ఉన్న పెద్ద ఫొటో అది! పెళ్ళికూతురి అలంకరణతో పెళ్ళిచూపులతో కూర్చున్నట్లుగా కూర్చుని ఉన్న యువతి చిత్రరంగులలో చిత్రించబడి ఉంది ఆ ఫోటోలో!

"ఇదేమిటి, అమ్మాయిని తీసుకొని రమ్మంటే ఫోటో, తీసికొచ్చారు?" మనసులో అనుకున్నారు రామ్మోహనరావుగారు. ఆయన ముఖంలో ఆశ్చర్యం తొంగి చూస్తోంది.

ఆ ఫోటోలోని "ఆమె"ను చూసి అవాక్కయి పోయాడు సురేంద్ర. "ఆమె" ఎవరో కాదు, డిగ్రీలో తన క్లాస్‌మేట్ "రాజ్యలక్ష్మి!"

పెళ్ళిచూపులకు పిలిచి అమ్మాయిని చూపించకుండా ఫోటో చూపించడం, అందునా అది రాజ్యలక్ష్మి ఫోటో కావడం అంతా అయోమయంగా ఉంది సురేంద్రకు. రాజ్యలక్ష్మి ఫోటో చూస్తున్న కొద్దీ గతమంతా కళ్ళ ముందు మెదిలి కలవరపడ్డాడు సురేంద్ర.

రాజ్యలక్ష్మితో పరిచయం...... స్నేహం...... మనసులు, తనువులు ఏకం కావడం...... రాజ్యలక్ష్మి పెళ్ళికి తొందర చేయడం...... తన చదువును అడ్డం పెట్టుకొని తన మీద లక్షల కట్నం రాబట్టాలని చూస్తున్న ఛాందసుడైన తండ్రికి భయపడి తాను సందేహించడం...... ఆకస్మాత్తుగా రాజ్యలక్ష్మి కాలేజ్ మానేయడం...... మొదటిలో రాజ్యలక్ష్మి గుర్తొచ్చి మనసులో ముల్లులా గుచ్చుకొంటున్నా ఆ తర్వాత ఆమె తన జ్ఞాపకాల మరుగున పడిపోవడం...... అన్నీ ఒక్కటొక్కటిగా కళ్ళ ముందు కదలాడాయి సురేంద్రకు. రాజ్యలక్ష్మిది ఈ ఊరని కాని, తమను పెళ్ళిచూపులకు ఆహ్వానించిన ప్రసాదరావుగారిఅమ్మాయనికాని ఇక్కడకు వచ్చేవరకు తనకు తెలియదు. అంతవరకు అతనిలో ఉన్న ఆతృత ఆవిరైపోయి ఆస్థానే ఒక్కసారిగా నీరసం ఆవరించింది, గతం తాలూకు జ్ఞాపకాలతో అతని ముఖం మ్లానమైపోయింది.

వారు ఆశ్చర్యం నుండి తేరుకోక ముందే ఫోటో చూపిస్తూ, తనకూతురి అందచందాల గురించి, గుణగణాల గురించి చెప్పినదే మరల చెప్పసాగారు ప్రసాదరావుగారు. ఈసారి ఆయన ముఖంలో అంతకు ముందున్న ఉత్సాహం లేదు. ఆయన గొంతులో అంతకు ముందున్న గాంభీర్యం లేదు. ఆయన ముఖంలో దైన్యం, ఆయన పెదవులపై జీవం లేని నవ్వు, ఆయన కనులలో తడి, ఆయన తీరు చూసిన రామ్మోహనరావుగారికి ఏదో అర్థమైనట్లయి మౌనంగా లేచినుంచున్నారు.

ప్రసాదరావుగారితో వస్తామని చెప్పి ముందుకు కదిలిన తండ్రిని అనుసరించాడు సురేంద్ర, విషయమేమిటో అర్థం కాకపోయినా.

ప్రసాదరావుగారు వారి వెనుకనే వెళ్ళి "అమ్మాయి నచ్చిందా బాబూ?" అని అడిగి మరల అంతలోనే "ఎందుకు నచ్చదు? మా అమ్మాయి కుందనపు బొమ్మ" అన్నారు. వెనుకకు తిరిగి ఫోటో వంక చూస్తూ!

రామ్మోహనరావుగారు, సురేంద్ర ఏమీ మాట్లాడకుండా ముందుకు నడవటం చూసి, వెనుకకు వెళ్ళి "పిళ్ళకూ నచ్చలేదటమ్మా నువ్వు...... ఎన్ని సంబంధాలని చూడను తల్లీ......" అంటూ ఆ ఫోటో ముందు భోరున విలపిస్తూ కూలబడి పోయారు ప్రసాదరావుగారు.

గుమ్మం దాటబోతున్న రామ్మోహనరావుగారు ఆయువకుడు తమ వెనుకే రావడం గమనించి ఆగారు.

"క్షమించండి... మిమ్మల్ని పెళ్ళిచూపులకు పిలిచిన సంగతి మాకు తెలియదు. మా పెదనాన్న గారి అమ్మాయి రాజ్యలక్ష్మి కాలేజిలో ఎవరినో ప్రేమించి మోసపోయింది. ఆసంగతి తెలియని మా పెదనాన్న రాజ్యలక్ష్మికి పెళ్ళి చేయాలని సంబంధం చూసి పెళ్ళిచూపులు ఏర్పాటు చేసారు. కాని, తెల్లవారితే పెళ్ళిచూపులనగా ఆరాత్రి రాజ్యలక్ష్మి నిద్రమాత్రలు మింగి ఆత్మహత్య చేసికుంది. అల్లారు ముద్దుగా పెంచుకున్న ఒక్కగానొక్క కూతురు ఆ విధంగా బలయిపోవడంతో ఆయన దాదాపు పిచ్చివాడయ్యాడు. అప్పటి నుంచి ఎక్కడెక్కడి సంబంధాలో వాకబు చేయడం, వాళ్ళను పెళ్ళిచూపులకు ఆహ్వానించడం వాళ్ళు వచ్చిన దగ్గర నుండి ఈవిధంగా ప్రవర్తించడం అలవాటయి పోయిందాయనకు, మేమెంత చెప్పినా ఆయన వినడం లేదు... ఎంత ప్రయత్నించినా ఆయనను మార్చలేకపోతున్నాం..."

ఆ యువకుడి మాటలు ఒక్కొక్కటి ఒక్కొక్క శూలమై సురేంద్రగుండెను తూట్లు పడేటట్లు చేసాయి. ఫోటో ముందు కూలబడి భోరున హృదయ విదారకంగా విలపిస్తున్న ప్రసాదరావుగారిని చూసేసరికి అతని హృదయంలో తప్పు చేసానన్న భావం కదలాడి పశ్చాత్తాపంతో దహించుకుపోయాడు. దోషిలా తలవంచుకున్నాడు సురేంద్ర. అతడి కనుల నుండి రెండు కన్నీటి బిందువులు జారిపడ్డాయి. రాజ్యలక్ష్మి ఆత్మశాంతికి అర్పణలిస్తున్నట్లుగా!! ●

# కోటికాంతుల కొవ్వొత్తులు







చీకటి వెలుగుల రంగేళి పండుగనాడు అందంతోపాటు ఆనందాన్ని, కంటికి ఆహ్లాదాన్ని కల్గిస్తాయి కోటికాంతుల కొవ్వొత్తులు.

క్రీస్తుకు పూర్వం నుంచి కొవ్వొత్తులు వాడకంలో వున్నట్లు ప్రాచీన ఈజిప్టు, చైనా, గ్రీకుల యొక్క సాహిత్యం మూలాన మనకు విశదమవుతుంది. ఈనాడు ఆనాటికి కొవ్వొత్తులలో తేడా వాటిని ఉపయోగించే విధానంలో భేదాన్ని కల్గియుంటాయి.

నాగరికత, శాస్త్ర విజ్ఞానం అభివృద్ధితో క్రమంగా వాయుదీపాలు. విద్యుత్ దీపాలు కనిపెట్టబడిన తరువాత కొవ్వొత్తి కాంతి ఐనకంగా క్రమంగా నిరుపయోగమైంది. అయినా కొవ్వొత్తులుండని ఆధునికగృహం ఉండదనుటలో అతిశయోక్తి లేదు. ఆధునికుడు కూడా ఏదో ఒక రాత్రి దీని ఉపయోగాన్ని గుర్తిస్తాడు.

కొవ్వొత్తి ఇటాలియన్, స్పానిష్, పోర్చుగీసు భాషలలోని కాండిలా, ఇంగ్లీషు భాషలోని కాండిల్, జర్మనీ భాషలోని కెర్జెలు-ఇవన్నీ లాటిన్ భాషలోని కాండీర్ (కాంతి) అనే మాట నుండి ఉద్భవించాయి.

కొవ్వొత్తులు దీపాలుగా మాత్రమేకాక కాలమానంగా ఉపయోగించేవారు. రెండు గంటల కొవ్వొత్తి, నాలుగుగంటలకొవ్వొత్తి అని బజారులో లభ్యమయ్యేవి.

నాలుగు గంటల కొవ్వొత్తి అంటే ఆ వత్తి పూర్తిగా కాంతినిస్తూ వచ్చే సమయం 4 గంటలు. ప్రతీ అరగంటకు కొవ్వొత్తులు కరిగిన దానినిబట్టి గంటలను గణన చేసేవారట.

నాలుగు గంటల కొవ్వొత్తి అంటే ఆ వత్తి పూర్తిగా కాంతినిస్తూ వచ్చే సమయం 4 గంటలు. ప్రతీ అరగంటకు కొవ్వొత్తిపై గుర్తులుంటాయి. ఆ సంకేతాలను బట్టి కొవ్వొత్తులు కరిగిన దానిని బట్టి గంటలను గణన చేసే వారట.

19వ శతాబ్దం యొక్క ఉత్తరార్థం వరకు తేనెపట్టు మైనాన్ని 'టిలో' ను కొవ్వొత్తుల తయారీలో వాడేవారు. తిమింగలాల నూనె నుండి తీసిన 'స్పెర్మాసిటి' రావడంతో దీనినుంచి వెలుబడే కాంతి అధికం కావడం వలన, తక్కువ ధరకు లభ్యమవడం వలన దీనిలో తయారైన కొవ్వొత్తులపై మోజు ఎక్కువైంది. 1850 తరువాత కోల్‌తారు, పెట్రోలియం నుంచి వేరుచేసిన పారఫిన్‌లు వాడుకలోకి వచ్చాయి. కొవ్వొత్తుల తయారీలో ప్రస్తుతం వాడే ముడిపదార్థాలను అవి లభ్యమయ్యే ఉనికిని బట్టి ఖనిజ జంతు, వృక్ష సంబంధమైనవిగా వర్గీకరించారు.

కొవ్వొత్తుల పరిశ్రమ అనుకున్నంత సరళమైనది కాదు. కొవ్వొత్తుల ఒత్తులలో సుమారు నూరు రకాలున్నాయి. వత్తి యొక్క ఎంపిక, కొవ్వొత్తి యొక్క సంఘటనం. పరిమాణం, తయారుచేసే విధానాలపై ఆధారపడియుంటుంది. ఔషధీయుత మొక్కలు ద్వారా తయారుచేసిన కొవ్వొత్తుల ప్రాముఖ్యత పురాతన కాలం నుండి తెలుసు. ఔషధీయుత కొవ్వొత్తులను మండించినపుడు వెలువడిన బాష్పాల ప్రభావం వలన కొన్ని రకాల జబ్బులను నివారించవచ్చునన్న అభిప్రాయం అనాడు వుంది.

కొవ్వొత్తులతోపాటు కొవ్వొత్తులపై సెమ్మెలకు కూడా చరిత్రలో ఎంతో ప్రాముఖ్యత వుంది. ఈ సెమ్మెలకు ఇంగ్లండు ఎంతో పేరు పొందింది.

అతి ఖరీదైన సెమ్మెలుండటం అంతస్తు గుర్తుగా భావించబడేది ఆ రోజులలో.

ఆరవ హెన్రీకి కొవ్వొత్తుల సెమ్మెలంటే ప్రాణమట. అతని దగ్గర ఎంతో విలువచేసే రెండు సెమ్మెలుండేవి. వాటిలో నాలుగు పచ్చలు. నాలుగు మణిమాణిక్యాలు, నాలుగు కెంపులు, 24 ముత్యాలు పొదగబడ్డాయట. అలాగే 8వ హెన్రీ చక్రవర్తి దగ్గర సుమారు 120 ఔన్సుల బరువువున్న నాలుగు బంగారపు దీపపు సెమ్మెలుండేవి.

కొవ్వొత్తుల తయారీలో అనేక పద్ధతులున్నాయి.

ఏది ఏమైనా నూతన సంవత్సర ప్రారంభంలో కొవ్వొత్తులు, వెలిగిస్తూ పాత సంవత్సరానికి వీడ్కోలు చెబుతూ, కొత్త సంవత్సరానికి స్వాగతం పలకడమంటే అందరకూ సరదాయే...

పుట్టినరోజు పండుగ, క్రిస్మస్ పర్వదినం, దీపావళి పండుగ సందర్భాలలో కొవ్వొత్తులకున్న విలువ అందరకూతెలుసు.

చీకటి వెలుగుల రంగేళిలో నూత్న కాంతులు విరజిమ్ముతుంటాయి కొవ్వొత్తులు.

— మాచిరాజు వేణుగోపాల్





ఏమిటే రోజా?
హాయ్ రాజీ! రిజల్టు వచ్చాయే!




నేను పాసయ్యాను - నీ నెంబరు




రోజా వెంటనే వెళ్ళిపోయింది - ఇక
రాగాలు తీయడం మొదలెట్టింది!




అమ్మాయి పరీక్ష తప్పిందట దాని స్నేహితురాలు చెప్పెళ్ళింది




ఎవరా అన్నది! అమ్మాయి ఫస్టుక్లాసులో పాసయితేనూ




ఎవరే నువ్వు తప్పావన్నది! నువ్వు ఫస్టుక్లాసులో పాసయ్యావు! నే కనుక్కున్నాగా




కాసేపాగితే
పేపరొస్తుంది - చూద్దువుగాని
(ఇంకా ఉంది)

# ఆత్మ ఘోష

అమెరికాలోని పోర్ట్‌లాండ్‌లో ఉన్న ఒక యింటిలో ఒక హత్య చేయబడ్డ యువకుడి ఆత్మ తన దారుణమైన, హత్య గురించి అతని తల్లికి చెప్పడానికి రెండేళ్ళు పట్టింది.

పోర్ట్‌లాండ్‌లోని మధ్య తరగతికి, మర్యాద గలిగిన ఒక వంశంలో జేమ్స్ సూటాన్ జన్మించాడు. అతను ఆర్మీలో, అన్నాపోలీస్ మిలటరీ అకాడమీలో గౌరవప్రదమైన ఆఫీసర్ ఉద్యోగం సంపాదించిన నాడు అతని తల్లిదండ్రులు ఎంతో గర్వించారు.

1907 లో అక్టోబరు 11న అతని వద్ద నుండి వచ్చిన ఉత్తరాన్ని అతని తల్లి రోసా సూటాన్ ఎంతో ఆత్రంగా అందుకొంది.



కానీ ఆ ఉత్తరం చదువుతుండగానే రోజా చేయి విపరీతంగా వణికి ఏదో అపశకునం కలిగినట్లుగా ఆ తల్లి బాధపడింది. మర్నాడు ఆమె తన కుటుంబ సభ్యులతో కూర్చుని ఉండగా గట్టి షాక్ తగిలినట్లు ఆమె ఎంతో బాధకు గురయింది.

ఆ తరువాత రెండురోజులు కూడా ఆమె అలాగే యిబ్బందిగా ఏదో తెలియని బాధకు గురయ్యింది. ఆ రోజు సాయంత్రం జేమ్స్ తండ్రి సూటాన్ అకస్మాత్తుగా ఆఫీసు నుంచి వచ్చాడు. ఆయన చేతిలోని టెలిగ్రాంలో జేమ్స్ అన్నాపోలీస్ అకాడమీ కాల్చుకుని చనిపోయినట్లుగా ఉంది.

కానీ రోసా మాత్రం తన కొడుకు ఆత్మహత్య చేసుకోవడం తనకు నమ్మశక్యంగా లేదని అంది. ఆమె తరువాత యిలా అంది "జేమ్స్ నా ప్రక్కన నిలబడి" అమ్మా! నేను ఎప్పటికీ ఆత్మహత్య చేసుకోలేదు. నేనంత పిరికివాడ్నికాదని. జేమ్స్ ఆమెకు కనబడి అతను ఎలాహత్యా చేయబడ్డాడో వివరించాడు.

ఒకరు అతనిని తుపాకి మడమతో తల మీద బాదగా, ముగ్గురు అతని మీదకు లంఘించి, అతన్ని తీవ్రంగా గాయపరిచారు. అతని మొహాన్ని నేలకేసి బలవంతంగా రుద్దారు. వాళ్ళు అతన్ని తన్ని అతని రిస్ట్ వాచ్‌ను పగులగొట్టారు.

"మీరుగనుక నుదుటినిచూసివుంటే నేనెంత చిత్రహింస చేయబడ్డానో తెలిసి ఉండేది" అని జేమ్స్ బాధగా చెప్పినట్లు రోసా పేర్కొంది. "నా హత్య గురించి అందరికీ తెలిసేదాకా నా ఆత్మ శాంతించదు" అని మామయ్య ముందు జేమ్స్ అన్నాడు.

కానీ తొందరలోనే మళ్ళీ అక్టోబరు 16న జేమ్స్ కనబడ్డాడు, అతను తన హత్య గురించి మరిన్ని వివరాలను తన తల్లితో చెప్పాడు. హంతకులు తాము కొట్టిన దెబ్బలను దాచటానికి తనకు ఏ విధంగా మొహానికి పట్టీలు వేశారో అతను వివరించాడు. జేమ్స్ మరొకసారి మొహం కనబడకుండా పొడుగాటి కోటువేసుకొని కనబడ్డాడు.

ఒక్క రోసా మాత్రమే కాక ఆ యింట్లో అందరూ జేమ్స్ కనపడ్డాడని చెబుతారు. జేమ్స్ తమ్ముడు, డాన్ తను తన అన్న జేమ్స్‌ను మరణం తర్వాత చూశానని ప్రమాణం చేసి మరీ చెబుతాడు, చెల్లెలు లైసా తనకు తన అన్న కనబడి ఒక ఫోటో చూపించాడని అందులోని వారంతా జేమ్స్‌తో కలిసి పనిచేసిన వారనీ చెప్పింది. వారిలో ఒకరిని ఉల్లిగా ఆమె గుర్తించింది. రోసాకు తరువాత జేమ్స్ కనబడి తన శవం భూగర్భంలో ఉట్టి దాచాడని చెప్పాడు.

యిందతా నిజమని నిరూపించే సంఘటన ఒకటి జరిగింది. జేమ్స్ మరణించిన 3 వారాల తరువాత అతని చెల్లెలు లూసీ తన అన్నకు సంబంధించిన వస్తువులు తీసుకువచ్చింది. అందులో పగిలిపోయిన రిస్ట్‌వాచ్ ఉంది!

కానీ అఫిషియల్ రికార్డ్స్ ప్రకారం జేమ్స్, అతని స్నేహితులు కలసి ఒక పార్టీకి వెళ్లారనీ, అక్కడ బాగా తాగి ఒకరితో ఒకరు పోట్లాడుకున్నారనీఉంది. ఆ తరువాత జేమ్స్ మిగతా యిద్దరినీ తెల్లవారే లోపు చంపుతాననీ బెదిరించాడట. ఆ కేసు




మీద అతన్ని అరెస్ట్ చేయబోగా అకస్మాత్తుగా తన తుపాకీ తన మీదకు తిప్పుకొని అతను కాల్చుకున్నాడనీ పోలీస్ అధికారుల కథనం.

జేమ్స్ శవాన్ని ఆర్లింగ్‌టన్ స్మశాన ➡

విజ్ఞాన మంజరి

# దృష్టిదోషాలకి పై మందు!

"సర్వేంద్రియాణాం "నయన" ప్రధానం" అన్న సంగతి అందరకూ తెల్సిందే! అలాంటి కంటికి గాయాలు, రోగాలకు సంబంధించి పరిశోధనలు పలురకాల మందులు తయారు చేస్తున్నప్పటికీ నిత్య జీవితంలో సమస్యలు ఎదుర్కొంటూనే వున్నారు ప్రజలు.

తెల్లసారాయి సీసాలకుండే బిరడాలు, యితరపెండు బిరడాల వల్ల కంటికి ప్రమాదాలు కలుగుతాయని ఎందరకు తెలుసు? సిన్న పిల్చే గొట్టాల (పిప్పెట్, బ్యూరెట్ వంటివి) వంటి వాటిని సరిగా ఉపయోగించక పోవటం వల్లా, లేదా చిన్నపిల్లలు మంచు ముద్దలతో చేసే యుద్ధాలు (ఇవి ఆట అయినప్పటికీ) కూడా కంటి గాయాలకు బాగా ఉపకరిస్తాయి. కంటిలో మచ్చలు, కళ్ళుఎర్రబడటం, తెల్లమచ్చలు రావటం, మసకగా కనిపించడం, లేదా నల్లగుడ్డు తెల్లరంగులోకి మారటం. అదీ కాకుంటే మెల్లకన్ను రావటం వంటి ఎన్నో రకాలుగా ఈ వ్యాధి వ్యాపించవచ్చునంటున్నారు ప్రత్యేక నేత్ర పరిశోధక బృందం.

పైన చెప్పిన అన్ని కంటి గాయాలకు అల్ట్రాసౌండ్ మిషన్ల ద్వారా నయంచేసేవారు. లేదంటే శస్త్ర చికిత్స చేయటం జరిగేవి. అయితే కంట్లో రాయిపడటం. లేదా గట్టి దెబ్బతగలటం వల్ల కన్ను చిరికితే లేక మరే ఇతర తీవ్రతలకు గానీ శస్త్ర చికిత్స మాత్రమే చేయటం జరిగేది, అలా



చేసినప్పటికీ కన్ను పనిచేస్తుందీ లేనిదీ ఖచ్చితంగా చెప్పటం కష్టం.

కానీ యిందుకు పూర్తి విరుద్ధంగా మాస్కోలోని హెల్మ్‌హోల్ట్జ్ కంటిరోగ నివారణ కేంద్ర ఇన్‌చార్జి ప్రొఫెసర్ రోజ్ గుండోరవ ఒక కొత్త రకమయిన రసాయనికాన్ని తయారు చేయటం జరిగింది. ఇది పూర్తిగా కంటిరక్షణను ఏర్పరుస్తూ సమృద్ధమయిన బలాన్ని కూడా కంటికి ఏర్పరుస్తుంది. దీనిని ఇంజక్షన్ ద్వారా రోగికి ఎక్కిస్తారు. ముందుగా కంటికి సంబంధించిన రోగనిర్ధారణ చేసి ఆపై చేయాల్సిన సరకీ చేసి కంటి చివరి భాగంలో వుండే దిమ్మకు ఈ యింజక్షన్ చేయటం జరుగుతుంది. కంటికి సంబంధించి ఎలాంటి లోపమున్నా ఈ యింజక్షన్ ప్రభావం వల్ల 10 రోజులలో తగ్గిపోతుంది.

ఈ ఫోటోలో పరీక్ష చేయించుకుంటున్న ఆమెకు కంటిలో నలుసు పడి- ఆ కన్ను రుద్దటం వల్ల తెల్లపొర చిరిగిపోయింది.

యిలాటి వాటిని "రిజుకీఆల్వా" మిషన్ ద్వారా చూసి ఆపై ఈ యింజక్షన్ యిస్తారు. ఇంతకీ ఆ ఇంజక్షన్ పేరు చెప్పలేదు కదూ ఆ అమ్మం పేరు – "ట్రిస్టొడికేన్".

– అశ్వద్ధామ

---

ములో పాతిపెట్టారు. కానీ అతను ఆత్మ మాత్రం పోర్ట్‌లాండ్‌లోని అతని యింటిని వదిలి పెట్టలేదు.

నావలో డాక్టర్ల రిపోర్ట్ ప్రకారం జేమ్సుది ఆత్మహత్య అనీ అతని మొహం అంతాగాయాలు లేకుండా బాగుందనీ ఉంది. వారు అతనిది ఆత్మహత్య అని నిర్ధారించారు. రెండేళ్ల తరువాత జేమ్స్ తల్లి దండ్రులు మళ్లీ జేమ్స్ బాడీని పరీక్షించమని కోరారు.

ప్రైవేట్‌గా చేసిన పరిశోధన మూలముగా జేమ్స్ చెప్పినవన్నీ కరక్టుగా సరిపోయాయి. బుల్లెట్ రంధ్రాన్ని పరీక్షించి, ఆత్మహత్య చేసుకుంటే ఆబుల్లెట్ అక్కడ, దూరటానికి అవకాశం లేదని కూడా వారు చెప్పారు.

కొద్ది కాలంలోనే ఒక అకాశరామన్న ఉత్తరం వచ్చింది. అందులో జేమ్స్ హత్య చేయబడ్డాడు అని నిర్ధారిస్తూ ఎవరో రాశారు.

ఒక మంచి ఆదర్శవంతమైన క్రైస్తవ మతస్తుడిగా తాను ఆత్మహత్య చేసుకోలేదని నిరూపింపబడ్డ తరువాత జేమ్స్ మళ్లా కనబడలేదు,

జేమ్స్ ఆత్మ శాంతించింది!

– టి. ఎస్. రావు

## భారత్‌ను కలవరపెడుతున్న "న్యూట్రాన్‌బాంబ్"!

ప్రపంచ మానవాళిని భయ కంపితుల్ని చేసిన "హిరోషిమా" సంఘటనలను మనం మరచిపోలేక పోతున్నా అనేక దేశాలు అణ్వాయుధ తయారీకి పోటీ పడుతున్నాయి. అగ్రరాజ్యాలైన అమెరికా రష్యాలు అణ్వాయుధ వ్యాప్తిని నిరోధించి, ప్రపంచ ప్రజలకు శాంతి గురించి ప్రబోధిస్తుంటే, మన పొరుగు దేశమైన చైనా అక్టోబర్ చివరి వారంలో న్యూట్రాన్ బాంబ్" పరీక్ష జరిపిందని ఆలస్యంగా అందిన వార్తలను బట్టి తెలుస్తోంది.

"న్యూట్రాన్ బాంబ్" పరీక్ష జరపటంతో చైనా న్యూట్రాన్ బాంబు కల్గిన నాల్గవ దేశంగా వరుసలోకి



వచ్చింది. క్రితంలో అమెరికా, రష్యా, బ్రిటన్‌లు న్యూట్రాన్ బాంబ్స్‌ను కలిగి ఉండి పరీక్షలు కూడా జరిపాయి. సిన్‌జాంగ్‌లోని లోప్‌నార్ అణు పరీక్ష కేంద్రం వద్ద ఈ ప్రయోగం జరిగిందని తెలుస్తోంది. కాని అమెరికా వర్గాలు మాత్రం ఈ న్యూట్రాన్ పరీక్ష గురించి ఖండించలేదు గాని, ఈ పరీక్షకు మాత్రం అంత ప్రాముఖ్యత ఇవ్వాల్సిన అవసరం లేదంటున్నాయి. దశాబ్దం క్రితమే అప్పటి అమెరికా కార్యదర్శి కీసింజర్ చైనా పర్యటనలో న్యూట్రాన్ బాంబు నిర్మాణానికి అమెరికా అభయహస్తం ఇచ్చినట్టు వార్తలు వెలువడ్డాయి!

ప్రస్తుతం ఇతర దేశాలకు ఆయుధాల సరఫరా చేయగలిగే స్థాయిలో ఉన్న చైనా న్యూట్రాన్ పరీక్ష జరపటంతో పశ్చిమ సియోల్ శాంతికి విఘాతం ఏర్పడే పరిస్థితులు ఏర్పడనున్నాయి! డిశంబర్‌లో రాజీవ్ చైనాపర్యటన జరపనున్న తరుణంలో ఈ పరీక్షజరపటం గమనార్హం.

సత్యశోధక్

## జోకుల-కేకులు



హార్మోనియం కొందామని షాపుకు వెళ్ళాడు సుబ్రావ్. షాపులో సంగీత సాధనాలతోపాటు తుపాకులు కూడా కనిపించాయి.

"ఇదేమిటి ? ఈ షాపులో తుపాకులు కూడా వున్నాయి. ఈ షాపుకు, తుపాకులకు అసలు సంబంధమేముంది" ఆశ్చర్యంగా కొట్టువాడిని అడిగాడు.

"ఉందిసార్ ! ఉదాహరణకు మీరు హార్మోనియం కొనుక్కుని తీసుకు వెళ్ళిన నాలుగు రోజులకు మీ ఇంటి చుట్టుప్రక్కల వాళ్ళొచ్చి ఒక్కో తుపాకి కొనుక్కుంటారు.



"మరో సంవత్సరకాలం వరకూ మీరు బీదరికంతోనే నానా కష్టాలు పడవలసిందే" చెప్పాడు జ్యోతిష్కుడు సుబ్రావ్‌తో.

సుబ్రావ్ సంతోషపడిపోయాడు.

"అంటే ఈ సంవత్సరం పోయాకా నేను గొప్పోడిని అయిపోతానా"

"గొప్పోడివా...గాడిదగుడ్డా... ఈ కష్టాలకు అలవాటు పడిపోతావు"

★ ★ ★

ఆర్మీ ఆఫీసర్‌ని ఇంటర్వ్యూ చేస్తున్నారు అధికార్లు.

"అన్నా...సిపాయిలందరూ మంచి క్రమశిక్షణతో సరిహద్దుల్లో యుద్ధానికి పోతున్నారే...యుద్ధానికి వెళ్ళని వాళ్ళని ఏం చేస్తామన్నా రేమిటి?"

"ఓ రెండు నెలలు వాళ్ళ భార్యల దగ్గరకు పంపేస్తానని బెదిరించాను...అంతే"

- కె.వి. మధుసూధన్‌రావు






## పోరులో వెనుకాడని పక్షిరాజులు!

స్కుయస్ అనే పక్షి ఇంచుమించు మాదిరి ఉంటుంది. దీనికి అతి యిష్ట ఆహారం చిన్న చిన్న పెంగ్విన్ పక్షి పాపం పెంగ్విన్ పిల్లలు ఏమరుపా ఉన్నప్పుడు వెనక చాటుగా వాటిని







జియార్బీ



వేసుకుని వెళ్లి పొట్టన పెట్టుకోవడం స్క్యుయస్ పక్షికి అలవాటు. దాని వేట తీరే అంత! అయితే పెద్ద పెంగ్విన్ పక్షి ఎదురు పడితే మాత్రం యుద్ధం తప్పదు. అటో ఇటో తేలే వరకు రెండూ నిద్ర పోవు. పెంగ్విన్ సాదువుగా కనిపించినా రోషం వస్తే మాత్రం తీసి పోదు. దుష్టుడిని దెబ్బ కొట్టినప్పుడే కదా ఎవరికైనా విలువ!



## జేసుదాసు గొప్ప

మనదేశంలో విమానంలో ఎక్కువగా పయనించే ప్రముఖ నేపథ్య గాయకుడు జేసుదాసు అని ఇండియన్ ఎర్‌లైన్స్ వారంటారు. వివిధ భాషల్లో ఎన్నో పాటలు పాడి దేశ విదేశాలలో అసంఖ్యాకంగా అభిమానులున్న ఈయన గాత్రం రేడియోకు పనికి రాదని ఒకప్పుడు తిరువనంతపురం ఆలిండియా రేడియో తిరస్కరించింది ఈయన చిత్రకారుడు. టెన్నిస్‌లో మొనగాడు.

## చిన్నారి తెర

"మహాభారత్" లో పాండురాజు అస్తమించాక ఆయన భార్య మాద్రి సహగమనం చేసే సన్నివేశాన్ని అత్యధిక వ్యయంతో చోప్రాలు చిత్రీకరించారు గానీ విమర్శకులకు గురి అవవలసి వస్తుందేమోనని దాన్ని తొలగించేసారు.



## లవ కుశులు

టి. వి. ఉత్తర రామాయణంలో లవకుశులుగా నటించే ఈ 14 ఏళ్ల కవల పిల్లల అసలు పేర్లు కూడా లవకుశులే సంగీతంలో శిక్షణపొందిన ఈ అబ్బాయిల స్వస్థలం కలకత్తా.

–(జి. వి. జి.)

## గోవింద!

ఓటేసే ముందు
ప్రతిసారీ తప్పటడుగే!
ఎందుకంటే
టోపీ వాడిది
తల వీడిది!




## చమత్కారాలు

### తోడు దొంగలు

తలనీలాల తో సహా
సర్వం పుచ్చుకుంటాడు
ఆ నామాల వాడు!
ఆయనకే నామం పెడతాడు
ఈ మంత్రిగారు!




నేస్తం

# Andhra Patrika Sunday Special Feature



Compiled by: Dr. G. Ramesh Babu

## I National Defence Academy Examination, May 1988

-SOME SAMPLE QUESTIONS :

1. Which one of the following is applicable to the planet 'Venus'? [ ]
   a) Smallest of the planets b) Bri ghtest as seen from the Earth c) Nearest to the Sun d) Farthest from the Sun .
2. Which one of the following pairs is correctly matched? [ ]
   a) Vaccination -Edward Jenner
   b) Malarial parasite -Robert Koch
   c) Laws of Heredity -Charles Darwin
   d) Penicillin -Ronald Ross
3. The shape of the earth is [ ]
   a) Elliptical b) Round c) Spherical d) Spheroidal
4. The following are given as reasons for the occurrence of the seasons
   1) Rotation of the earth 2) Revolution of the earth 3) The inclination of the earth's axis away from the normal to the plane of the orbit.
   Which of the above are correct reasons? [ ]
   a) 1 and 2 b) 1 and 3 c) 2 and 3 d) 1, 2 and 3
5. Which one of the following is correct? [ ]
   a) All longitudes are not great circles b) All longitudes and equator are great circles c) All latitudes and Greenwhich meridian are great circles d) All latitudes and longitudes are great circles.
6. Which one of the following provides a correct combination? [ ]
   a) Tamil Nadu - Water Power, Thermal Power and Atomic Power b) Kerala - Thermal Power c) Madhya Pradesh - Water Power d) Andhra Pradesh - Thermal Power and Atomic Power.

## II. Clerks' Grade Examination, September 1987

- SOME SAMPLE QUESTIONS :

1. 20% of a quantity is Rs. 400. The quantity equals [ ]
   a) Rs. 200 b) Rs. 800 c) Rs. 2,000 d) Rs. 8,000
2. If 10 men or 15 boys can do a piece of work in 45 days, then 25 men and 30 boys together can do the same work in [ ]
   a) 5 days b) 10 days c) $29\frac{1}{2}$ days d) 30 days
3. The units' digit in the product of 372×415×379×412 is [ ]
   a) 0 b) 1 c) 2 d) 4
4. Ram and Shyam entered into a partnership investing money in the ratio of 6:11 for 6 and 3 months respectively. If Ram got Rs. 1,440 as his share of profit, the profit of Shyam is [ ]
   a) Rs. 1,100 b) 1,200 c) Rs. 1,320 d) Rs. 1,400
5. The sides of a triangle are 5cm, 12cm and 13cm. Its area will be [ ]
   a) 24 sq cm b) 30 sq cm c) 60 sq cm d) 120 sq cm.
6. The rate at which a sum at simple interest will treble itself in 8years is [ ]
   a) $12\frac{1}{2}$% b) 15% c) 20% d) 25%

## III. Management Trainess'/Probationary Officers' Examination for Punjab National Bank, November 1987

- SOME SAMPLE QUESTONS :

Directions : There are two sets of figures. One set is called problem figures. Other set is called Answer figures. Problem set figures form some kind of series. What you are to do is to select one figure from the answer set figures which will continue the same series as given in the problem set figures.

PROBLEM FIGURES ANSWER FIGURES



Answers :

I. : 1-b, 2-a, 3-d, 4-c, 5-b, 6-a
II. : 1-c, 2-b, 3-a, 4-c, 5-b, 6-d
III. : 1-2, 2-5, 3-2, 4-2, 5-3

## Weekly Quotation :

" The gent who wakes up and finds himself a success hasn't been asleep.

- Wilson Mizner



# పక్షి రెట్ట నౌరా ప్రధానాదాయం

పసిఫిక్ మహా సముద్రంలో "నౌరా" అనే చిన్న దీవి వుంది. ఆ దీవి విస్తీర్ణం కేవలం ఎనిమిది చదరపుమైళ్ళే! అక్కడి జనాభా ఐదువేలు. "నౌరా" దీవిలోని ఒక్కో మనిషియొక్క సగటు వార్షికాదాయం 4,00000 రూపాయలు.

ప్రపంచ దేశాలన్నింటిలోకి చిన్నదీ, అత్యంత సంపన్న మయినదీ "నౌరా". అక్కడి ప్రజలు ఏవిధమయిన పనీ చేయరు. ఆదాయపు పన్ను అంటే వారికి తెలియదు. వారికి ఇళ్ళబాధలేదు. ప్రభుత్వమే వారి ఆరోగ్య బాధ్యత తీసుకొంటుంది. అక్కడి ప్రజలు ఏ విధమయిన పనీ చేయకపోయి నప్పటికీ వారికంత వార్షికాదాయం రావడానికి "ప్రకృతి" ప్రధాన కారణం.

అనేకవేల సంవత్సరాల నుండి పక్షులు ఆ దీవి మీద మలమూత్రాదులను విసర్జిస్తున్నాయి. 1900వ సంవత్సరంలో ఆ పక్షుల రెట్టలలో ఫాస్ఫేట్ విపరీతంగా ఉన్నట్లు కనుగొన్నారు. ఎరువుల తయారీలో ఫాస్ఫేట్ తప్పనిసరిగా ఉండి తీరాలి. నౌరాలోని ఎనిమిది కిలోమీటర్ల విస్తీర్ణంలో 4,20,00000 టన్నుల ఫాస్ఫేట్ నిక్షేపాలున్నాయి. దాంతో "నౌరా" దశ తిరిగి పోయింది.

ఈరోజున నౌరా నుండి ఏటా 20,00000 టన్నుల ఫాస్ఫేట్ వివిధ దేశాలకు ఎగుమతి చేయబడుతోంది. అయితే పక్షి రెట్టలను తవ్వే పనిని ఆ ద్వీప వాసులెవరూ చేయరు. ఇతర దీవుల నుండి పని వాళ్ళను రప్పించి ఆపని చేయిస్తుంది నౌరా ప్రభుత్వం.

నౌరాలోని ఐదువేలమంది తమ సమయం అంతా తినడానికి, నిద్రపోవడానికి, చేపలు పట్టడానికి, వాటిలను కొనుగోలు చేయటానికి, టేపురికార్డర్లను, బోట్లను, కార్లను కొనుగోలు చేయటానికి మాత్రమే వినియోగిస్తుంటారు.

కార్లంటే నౌరా వాసులకు విపరీతమయిన మోజు. అయితే ఆ ద్వీపం చుట్టూ 12మైళ్ళ పరిధిలో ఒకే ఒక్క రోడ్డు ఉంది.

కొద్ది సంవత్సరాల క్రితం అక్కడ రెండువేల వాహనాలుండేవి. నౌరా వాసులు కారు నడుపుతుండగా చెడిపోతే దాని అలానే రోడ్డు పక్కన పారేసి కొత్త కారు కొనుక్కుంటారు. అందువల్ల యిప్పుడు అక్కడి రోడ్డు పక్కల కార్లు గుట్టలు, గుట్టలుగా పడివుంటాయి.

అయితే ఇదే విధంగా ఎగుమతులను కొనసాగించినట్లయితే మరో యిరవై ఏళ్ళలో నౌరా దీవిలోని ఫాస్ఫేట్‌తో కూడిన పక్షిరెట్ట పూర్తిగా అయిపోయే ప్రమాదముందని శాస్త్రజ్ఞులు హెచ్చరించారు. అందుచేత నౌరా ప్రభుత్వం ముందు జాగ్రత్త చర్యగా ఆస్ట్రేలియా, అమెరికా వంటి దేశాలలో తన పెట్టుబడులను ఎక్కువ చేసింది.

— కోనే హరిబాబు

## జి.వి.జి



"ఒక సినిమా తార యధార్థ గాథ. ఆమెను ఒక ఇన్స్పెక్టర్, లాయర్, డాక్టర్ కలిసి బ్లాక్‌మెయిల్ చేస్తారు. లొంగక పోయేసరి వ్యభిచార నేరం సెక్షన్ కింద అరెస్టు చేస్తారు. దాంతో ఆ అమ్మాయి కోర్టుకు అప్పీలు చేస్తుంది. ఎన్నో మలుపులతో సాగుతుంది కథ. తారగా ఉమా మహేశ్వరి అనే మలయాళీ వనిత నటిస్తోంది," అన్నారు బ్రిజ్ ఫిలిమ్స్ ఇంటర్నేషనల్ పతాకంలో పై చిత్రానికి కథ సమకూర్చి నిర్మిస్తున్న జాకబ్ బ్రీజ్. కొమ్మినేని మాటలు, ఆత్రేయ పాటలు, గుణసింగ్ సంగీతం, బెర్నార్డ్ ఛాయ, నంబిరాజ్ నృత్యాలు, జూడో రత్నం సాహసాలు, కురుప్ ప్రొడక్షన్, కోటా సుబ్బారావు. సంయుక్త దర్శకత్వం, కందస్వామి కూర్పుతో ఈ చిత్రాన్ని డైరెక్ట్ చేసే కె. వి. ఫణీంద్ర "కొత్త తారలు చాలా మందిని పరిచయం చేసే ఈ చిత్రం మలయాళంలో కూడా తయారవుతోంది. నవంబర్ 11 నుంచి 16 వరకు మద్రాసులో షూట్ చేశాం. డిసెంబర్ 15 నుంచి 31 వరకు కేరళలో జరిగే షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తయి పోతుంది," అన్నారు.

"ఈ చిత్రంతో హాస్యంతో పాటు సెంటిమెంట్ కూడా ఉంటుంది. ప్రొద్దున చూసుకొని, మధ్యాహ్నం ప్రేమించుకొని, సాయంత్రం పెళ్ళాడేసి, ఒకళ్ళనొకళ్ళు అర్థం చేసుకోలేని స్థితిలో మర్నాడు విడిపోయే జంటలకు ఒక మహత్తరమైన సందేశాన్ని ఇస్తుంది కూడా," అన్నారు కోడి రామకృష్ణ. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో బి. బుల్లి సుబ్బారావు సమర్పించే సాయిసుధా కంబైన్స్ చిత్రంలో ఎ. ఎన్. ఆర్., రాజేంద్రప్రసాద్, గొల్లపూడి మారుతీరావు, కోట శ్రీనివాసరావు, జయసుధ, వాణీ విశ్వనాథ్, రోహిణి, వై. విజయ, చంద్రిక, జానకి నటిస్తున్నారు. శ్రీనివాస చక్రవర్తి కథ, తోటపల్లి మధు మాటలు రాశారు. సి. నారాయణ రెడ్డి, వేటూరి గీతాలను రాజ్‌కోటి స్వరపరిచారు. శరత్ ఛాయ, రామచంద్రసింగ్ శిల్పం, శివశంకర్ నృత్యాలు, బి. ముత్యాలథాము ప్రొడక్షన్, నాగేశ్వరరావు కూర్పుతో ఎన్. వి. ప్రసాద్ ప్రొడక్షన్ కంట్రోలర్. జి. సత్య ప్రతాప్, జి. సాయి శ్రీనివాస్ నిర్మాతలు. "నవంబర్ 1 నుంచి 15 వరకు మొదటి షెడ్యూల్ జరిగింది. రెండవ షెడ్యూల్ డిసెంబర్ 5 నుంచి 20 వరకు," అన్నారు నిర్మాణ సారథ్యం వహించే ఎన్. రామలింగేశ్వరరావు.

"మలయాళ సూపర్ హిట్ చిత్రం "ఆగస్ట్ –1" ఆధారం. ముఖ్య మంత్రిగా ఎ. ఎన్. ఆర్., పోలీస్ ఆఫీసర్‌గా కృష్ణ నటిస్తున్నారు. జమున గెస్ట్ ఆర్టిస్ట్", అన్నారు జి. హనుమంతరావు. ఈయన నిర్మిస్తున్న పద్మాలయా స్టూడియోస్ వారి పై చిత్రంలో సుజాత, చరణ్‌రాజ్, నాగభూషణం, ప్రభాకర రెడ్డి, గుమ్మడి, బాలయ్య, కోట శ్రీనివాసరావు, త్యాగరాజు, బ్రహ్మానందం, చలసాని కృష్ణారావు, రామ్మోహన్, సుమిత్ర, తతిమ్మా నటవర్గం. త్రిపురనేని మహారథి మాటలు, లక్ష్మణ్‌గోరే ఛాయ, భాస్కరరాజు, శిల్పం, టి. రఘునాథరెడ్డి సంయుక్త దర్శకత్వం డి. రామకృష్ణ, సుబ్రహ్మణ్యం. సహకార దర్శకత్వంతో జి. సత్యనారాయణ ప్రొడక్షన్ కంట్రోలర్. నాగేశ్వరరావు– సత్యం సంకలన కర్తలు. జ్యోతి ప్రసాద్ ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్. జి. ఆదిశేషగిరి రావు నిర్వహణతో కృష్ణ సమర్పిస్తున్న ఈ చిత్రానికి పి. చంద్రశేఖర రెడ్డి స్క్రీన్‌ప్లే– దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు.

"తమిళనాడులో 175 రోజుల పాటు ప్రదర్శింపబడిన "గురు శిష్యన్" చిత్రం ఆధారం. సంక్రాంతి నాడు పాటల రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం. ఫిబ్రవరి 10 నుంచి 22 వరకు మద్రాసులో, ఏప్రిల్ 10 నుంచి నెలాఖరు వరకు బెంగళూరు, మైసూరు లలిత మహల్ పేలెస్‌లో షూటింగ్. కృష్ణంరాజు సరసన సుమలత నాయిక. రాజేంద్రప్రసాద్ సరసన ఒక హిందీ తార వుండొచ్చు," అన్నారు పూర్ణప్రకాష్. ఈయన నిర్మించే చిత్రంలో నూతన్‌ప్రసాద్, మనోరమ, సుధాకర్ ప్రభృతులు తక్కిన నటవర్గం. గణేష్ పాత్రో మాటలు, ఇళయరాజా సంగీతం, వినాయక్ ఛాయ, ఎం. డి. సుందర్ కథ, బి. చలం శిల్పం, జుడోరత్నం సాహసాలు, పి. సరోజ నృత్యాలు, వి. వి. మూర్తి– నారాయణ, లక్ష్మీ నారాయణ సహకార దర్శకత్వం, నాగప్ప ప్రొడక్షన్, ఆర్. విఠల్ కూర్పుతో ఎన్. ఎన్. రావు సమర్పించే ఈ చిత్రానికి ఎస్. పి. ముత్తురామన్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తారు.



'రాజకీయ చదరంగం'లో ఎ. ఎన్. ఆర్., సుమిత్ర, సుజాత

## "మరణ ముహూర్తం"

"దీక్షిత్ అనే సంగీత దర్శకుని, పుణె ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్‌కి చెందిన ఛాయాగ్రాహకుడు సంపత్ కుమార్‌ను, చిత్రానువాద రచయితగా విజయవాడకు చెందిన వినాయక శర్మతో పాటు మా అకాడమీ మెంబర్స్ మోహన్‌కృష్ణ, వేణు, అమర్‌నాథ్, ప్రేంకుమార్, శంకరరావు, శివానంద్, కళాధర్, రాధయ్య, ఆచార్య, సుభాషిణి, శాంతి, మల్లిక్, ముంతాజీ వగైరా కళాకారులను పరిచయం చేస్తున్నాం. నాయికా నాయక పాత్రలకు ప్రముఖులనే ఎంపిక చేస్తాం. విశాఖపట్నం, అరకులోయ పరిసరాలలో జనవరి 1 నుంచి షూటింగ్," అన్నారు అభినయ ఆర్టిస్ట్ అకాడమీ ఫిలిం ప్రొడక్షన్స్ డివిజన్ ఛైర్మన్ వి. జనార్ధనరావు. ఈయన దర్శకత్వం నెఱపే పై చిత్రానికి గీతాలు: వేటూరి, సీతారామ శాస్త్రి, శిల్పం: బాలు, సహకార దర్శకత్వం: పి. విఠల్ కుమార్, ప్రసాద్. ప్రొడక్షన్ ఆర్గనైజర్స్: జి. శ్రీనివాసరావు, ఆర్. వెంకటేశ్వరరావు

## ఈవారం ఛాయా చిత్రం

## వారఫలాలు

25-12-1988 నుండి — 31-12-1988 వరకు

**మేషం** (అశ్వని,భరణి,కృత్తిక 1పా)
ఎదురులేని మాట, అనుకొన్న విధంగా ఆదాయం, అధిక ఆహ్వానాలు ఆదరణ, బంధువర్గీయుల రాకపోకలు, వ్యాపారాన అంతోయుతో ఆదాయం 26,27 లందు మిత్ర సమాగమం.

**వృషభం** (కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)
వారారంభాన ప్రయాణమూలక లాభం, వృత్తిరీత్యా పెంపు, ఉన్నత పదవులలో ఉన్న వారి మూలాన సదభిప్రాయం, అధికవ్యయం, ప్రమాదికీయతతో లాభం. 30,31 తా. లందు ధనలబ్ధి, వృత్తి ఆనందం, ఉత్సాహ జనకం,

**మిధునం** (మృగశిర 3,4పా,ఆర్ద్ర, పునర్వసు, 1, 2,3పా)
ముఖ్యకార్యాలు, వ్యవహారాలు, ధనవంతులతో మంతనాలు, 30, 31 తా.లందు సాగించుట సాధించుకొనుట శ్రేయస్కరం, వినోదకాంక్షతో కాలం వ్యయం చేస్తారు. కొందరు వారఫలం విశేషం ముందుగా గమనిస్తే కొంతలో కొంత మేలు.

**కర్కాటకం** (పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)
మీకు ప్రణాళికగా గల పలుకుబడితో కార్యసాధన గావించగలరు. "కుంభ" స్థితి రాహువు శుభఫలప్రదుడు కాగలడు. అతడు ఛాయాగ్రహమైనా ఇంద్రజాలకుడు. సర్వాలాభ్యాదరణముకు అనుకూలకాలం. 30, 31 తా. లందు ధనలబ్ధి గ్రహించాలి.

**సింహం** (మఘ,పుబ్బ, ఉత్తర 1 పా)
వారం మధ్యవరకు కొన్ని వ్యవహారాలు సానుకూలం గావు. విద్యావేత్తలం సహకారం లాభప్రదాయకం. వ్యక్తి వికాసం గమనింపదగిన అంశం. "వ్యవహార చక్రగుణ"ని వలన ఏదో మేలు జరుగనున్నది. 28,29 తా.లందు ఆదాయవృద్ధి.

**కన్య** (ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా)
ముఖ్యకార్యాచరణకు, నూతన వ్యాపారారంభానికి, ఆదాయాభివృద్ధికి, ఆనందోత్సాహాలకు అనుకూల సమయం. బంధుసమాగమమున్నది. అలసట, ప్రమాదికీయతకు మార్గమున్నది 29, 30 తా. లందు ధనవృద్ధి సన్మానలేఖం,

**తుల** (చిత్త 3, 4 పా, స్వాతి, విశాఖ 1, 2, 3 పా)
శ్రద్ధాసక్తులతో చేసిన వ్యవహారానికి లోటులేదు. ధనవంతుల సహాయం లభ్యమయ్యేదినం. ఉత్తముల స్నేహం లభ్యమవుతుంది. సభాగౌరవమున్నది. 27, 28 తా. ధనవ్యయానికి ఆస్కారం.

**వృశ్చికం** (విశాఖ 4పా, అనూరాధ, జ్యేష్ఠ)
దూర ప్రాంతాలనుండి ఆహ్వానితులు రానున్నారు. అధికంగా ఆదాయం చేకూరుట నిశ్చయం. వ్యాపారం చేసేలాగైతే మేలైన సమయమే. ప్రసిద్ధులతో స్నేహం ఏర్పడుతుంది. సమయానుకూలంగా ప్రవర్తించినా వ్యాపారనమేలు. 26, 27తా. ధనలబ్ధి.

**ధనుస్సు** (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)
స్త్రీవలన ఏదో మేలు చేకూరుతుంది. శుభదాయకదినం. గమనించండి. అప్రయత్నంగా ధనసేకరణకు మేలున్నా అంత వ్యయం చేకూరుట నిశ్చయం. బలవంతులతోఏదో ఇబ్బంది ఏర్పడనున్న దినాలు, 30, 31తా.లందు సుఖకాంతులు.

**మకరం** (ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)
శుభప్రదాయక దినాలు. వివిధంగా ఆహారలోపం చేకూరదని నమ్మండి. ముఖ్యబంధు సమాగమం, వస్తువాహన సేకరణకు అనుకూలం. ఉద్యోగమందున్న వారికి పక్కనిలవకాశాలు. 29, 30, 31 తా. అప్రయత్నాదాయం.

**కుంభం** (ధనిష్ఠ 3, 4 పా, శతభిష, పూర్వాభాద్ర 1, 2, 3 పా.)
అపూర్వవస్తుసేకరణకు ఆస్కారం, రాజకీయరంగాన మేలు చేకూరుతుంది. శ్రద్ధగా గమనించి దూరప్రాంతాలకు ప్రయాణం సాగించండి. అనేకవిధాల మేలున్నది. అప్రయత్నాదాయమున్నది. వాహనసేకరణకు ఆస్కారం. 29,30 తా. లందు సభాగౌరవాదులు.

**మీనం** (పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి)
శుభసూచక దినాలు, మీఆభీష్టం నెరవేరుతుంది. నూతన వ్యక్తులతో పరిచయం ఏర్పడటం, తద్వారా ఆదాయం ఏర్పడటం, గమనింపదగిన అంశం. విద్యావేత్తల సహాయము అందుతుంది. 26, 27, 28తా.లందు ఇష్ట మిత్ర సమాగమం.

విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# విశ్వరూపం

శాలాక్షుడు

## కామ పిశాచాలు !! ....

జింబాబ్వేలోని పురుషులలో నడి వయస్సులో వున్న మగవారికి ర్కాత్రానను పైశాచిక కామం కలుగుతోంది. ఇది ఒకరికీ, యిద్దరికీ కాకుండా చాలామందికి పుట్టడంవల్ల యిది వో రకం రోగమా అని ఆ దేశం ఆశ్చర్యభయాందోళనలతోకొట్టుకు పోతోందట. గత ఏడు 545 మంది పసిపిల్లలమీద కామదాహాలు తీర్చుకోడం జరిగిందట. ఈ 545 మంది ఆడపిల్లలూ ఏడాది నుంచి అయిదేళ్ళ లోపు వాళ్ళేనట. ఈ క్రూర కామ పిశాచులైన మగవారంతా నలభయ్యో పడివాళ్ళేనట.

## రహస్య ప్రియులు

ప్రేయసీప్రియులు రహస్యంగా కలుసుకునే పార్కులమీద ఆ పార్కుల అధికారులు నిఘాపెట్టుకుని (చైనాలో) అట్టి ప్రేమికులను బెదిరించి అధికారులమని అబద్ధాలుచెప్పి డబ్బు గుంజుకుంటున్నారట.




బీజింగ్, నాన్జింగ్ వంటి పట్టణాలలో యీ రకమైన పార్కుల అధికారులు రోజుకు సుమారు 13 అమెరికన్ డాలర్లు సంపాదించుకుంటున్నారట. చైనాలో అలా రహస్యంగా కలవడం నేరమట. నయమే !

## అపాత్ర దానం !!

సేలం అమ్మాగాపురంకు చెందిన అర్జునన్ అనే ఆయన మూడేళ్ళక్రితం తన కూతురు అన్నుక్కరసిని సేలం గృహకు చెందిన నాగరాజున కిచ్చి పెళ్ళిచేసి, చీరాసారెతో బాటు 24 కాసుల బంగారం పెట్టి పీటన్నిటి మీద వో పాతిక వేలు కట్నమిచ్చాడట. ఈ మొత్తాన్ని వాతాపి జీర్ణమనుకున్న ఆ నాగరాజు తన తలిదండ్రుల సమేతుడై భార్యను కాలి బంతిగా మార్చి ఆడుకునేవాడట. ఒకరోజు యీతాపు ఆమె పొత్తి కడుపులో తగిలి గర్భస్రావం జరిగిందట.



అదేమని ఆమె ఎదురు తిరిగినందుకు ఆ ముగ్గురుచేరి ఆమెను ఇంట్లోంచి వెళ్ళగొట్టారట. అంతే కాకుండా ఆ నాగరాజు తల్లిదండ్రులు తమ కుమారరత్నానికి మరో పాణిగ్రహణయత్నంచేయసాగారట. దాంతో అన్నుక్కరసికి రెక్కపుట్టి పోలీసుకు ఫిర్యాదుచేస్తే వారు ఆ త్రిదుష్ట మూర్తులనూ అరెస్టుచేశారట. భలా.

## వింతయదార్థం

### నాలుగు యుగాలు



హైందవ పురాణాల ప్రకారం కాలం చక్రంలాగా తిరుగుతూ ఉంటుంది. కృత, త్రేత, ద్వాపర, కలి యుగాలు ఒకదాని తరువాత ఒకటి నడుస్తూ నాలుగు యుగాలు అయిన తరువాత అంటే సుమారు 43,20,000 సంవత్సరాలకు మళ్ళీ ఇదే యుగాలు మొదలవుతాయి.




గ్రీకులు కూడా నాలుగు యుగాలను నమ్ముతారు. స్వర్ణ, రజత, కాంస్య, అయో యుగాలుగా ఆ నాలుగింటిని పిలుస్తారు. పాపం పండినప్పుడు యుగం అంతం అవుతుంది.



క్రైస్తవంలో కూడా నాలుగు యుగాలు ఉన్నాయి. సృష్టి మొదలుకొని మానవుని పతనం వరకు ఒక యుగం మానవుని పతనం మొదలుకొని క్రీస్తు ఆవిర్భావం వరకు ఒక యుగం మొదటి క్రీస్తు నుండి రెండవ క్రీస్తు వరకు మూడవ యుగం. కొత్త స్వర్గం క్రొత్త భూమి యొక్క సృష్టి నాలుగవ యుగం.




## దశమస్కంధము-

## ఉత్తర భాగము

## 37

అఖండ జ్యోతిరూర్తీ! పరమాత్మా! ధర్మ సంరక్షణంతోబాటు, ప్రపంచాభ్యుదయమే ఈ ప్రస్తుతావతారానికి ఏకైక లక్ష్యము. నీ ప్రభావంవల్ల ప్రభావంతులమయిన మేమందరము సమస్త భువనాలు సదా పరిపాలిస్తున్నాము. నీవు సజాతీయ విజాతీయ సహజ భేద్యశూన్యుడవయి, ఆది పూరుషుడవయి విరాజిల్లుతున్నావు. జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి అన్న మాయాకల్పితాలయిన ఈ మూడవస్థలకు అతీతుడవయిన పరబ్రహ్మస్వరూపుడవు నీవే. నిన్ను వేరొక వస్తువేది ప్రకాశింపజేయలేదు. అయినా స్వయం ప్రకాశుడవయి విరాజిల్లుతున్నావు నీవు. అన్నింటికి కారణమూర్తివయిన నీకు వేరొక కారణ కారణమేదిలేదు; అయినా నీవు సత్వరజస్తమో గుణాల విశిష్టత వ్యక్తీకరించగోరి, భవదీయ మాయా ప్రభావంవల్ల దేవతలు, మానవులు, పశువులు, పక్షులు ఆదిగాగల విశిష్టరూపాలతో విరాజిల్లుతున్నావు. సూర్యుడు స్వకీయ ఛాయవల్ల సమచ్ఛాదితుడయినా, ఆ ఛాయతోబాటు ఆది కప్పివేసిన పదార్థాలన్నింటిని ప్రకాశింపజేస్తున్నాడు. ఇదే విధంగా స్వయంప్రకాశ స్వరూపుడవయినా నీవు సత్వరజస్తమో గుణాలవల్ల సమాచ్ఛాదితుడవయినా, నీవు ఆ గుణాలతోబాటు, ఆ గుణాలు తామే అని భావిస్తున్న జీవులనందరిని ప్రకాశింపజేస్తున్నావు.

స్వామీ, నీ మాయా మోహితులయిన మానవులు, పత్నీ పుత్ర గృహాదులయందు ప్రగాఢాభిమానం పెంపొందించుకుని, నిరంతర శోకసాగరంలో మునిగిపోతున్నారు. లోకంలో మానవ శరీరం మిక్కిలి కష్టసాధ్యము. అది కేవలము భవదీయ పరమానుగ్రహంవల్లనే సంప్రాప్తిస్తున్నది. అట్టి నరదేహం సంప్రాప్తించినా ఇంద్రియ నిగ్రహంతో నీ పాద పద్మాలాశ్రయించని వాని జీవితం మిక్కిలి శోచ్యము. అట్టివాడు పట్టి ఆత్మవంచకుడే అవుతున్నాడు. ప్రభూ! నీవు సమస్త ప్రాణులకు ఆత్మవు. ప్రియతముడవు. పరమేశ్వరుడవు. అట్టి నిన్ను విడనాడి, దుఃఖమయములయిన తుచ్ఛవిషయాల వెంటబడి పరువులెత్తుతున్నవి. మూఢుడు అమృతంవిరనాడి, విషమే భుజిస్తున్నాడు. నాతోబాటు బ్రహ్మాదిదేవతలు, వినిర్మల హృదయులయిన మునీంద్రులు సదా భవదీయ శరణాగతులు సర్వేశ్వరుడవు, అత్యంత ప్రియతముడవు అయిన నీ కన్న మాకింక త్రికరణశుద్ధితో అర్పించదగిన వారెవ్వరున్నారు? ప్రభూ! ప్రపంచసృష్టి స్థితివినాశాంకేకైక కారణ స్వరూపుడవు నీవు! అట్టి నీవు సర్వుల ఎడల సమానుడవు. పరమప్రశాంతుడవు. అంతేకాదు ఎల్లరికి ప్రియమిత్రుడవయిన నీవు ఆత్మ స్వరూపుడవయి ఇష్ట దైవతమూర్తివయి విరాజిల్లుతున్నావు, జగత్తుకంతటికి ఆధారుడవయి, అధిష్ఠాన స్వరూపుడవయిన వాడవు నీవు. అద్వితీయస్వరూపా! ప్రభూ! మేమందరము సంసారమునుండి విముక్తి అభిలషించి సదా నిన్ను సేవిస్తున్నాము దేవా! ఈ బాణాసురుడు నాకత్యంత ప్రేమపాత్రుడేకాక సదా మదీయారాధకుడు. సేవకుడు. ఇంతకు మునుపే నేనీతని కన్ని విధాల అభయం ప్రసాదించాను. నీవీతని ముత్తాత ప్రహ్లాదునికి అభయం ప్రసాదించావు. అదే విధంగా ఈతనిని కూడా అనుగ్రహించవలసినది.

శ్రీకృష్ణభగవానుడు ఆ వినుత ఆకర్ణించి ఈ ప్రకారంగా ప్రసంగించాడు.

శంకర దేవా! నీవు ఆనతిచ్చినట్టు నేనీ బాణునికి తప్పక అభయం ప్రసాదించగలను నేనింతకు మునుపు ఆదేశించినట్టు నేనతని భుజాలన్ని విదళించాను. నీ వంశంలో జన్మించిన దైత్యులనెవ్వరిని సంహరించనని నీ నింతకుమునుపు మదీయ భక్తశిఖామణి ప్రహ్లాదునికి వాగ్దానంచేసి ఉన్నాను. ఇందువల్ల బలిపుత్రుడయిన ఈతనిని నేను వధించదలుచుకోలేదు. అయితే ఈ బాణాసురుని గర్వం నిర్మూలించవలెనన్న సంకల్పంతో బాహువులన్ని ఖండించాను. ఇదే విధంగా భూమికి దుస్సహభారమయిన ఈతని బలం సర్వము నిర్మూలించాను. అయితే ఈ బాణుని బాహువులు నాలుగుమాత్రమే శాశ్వతములయి శేషించగలవు. ఈతడు నీకు మహాభక్తుడయి నీ అనుచరుడయినందువల్ల ఎటువంటి భీతి సంప్రాప్తించనేరదు.

ఆ విధంగా శ్రీకృష్ణదేవుని అనుగ్రహంతో బాటు అభయవరం స్వీకరించిన బాణాసురుడు పాదాలపై వాలి ప్రణమిల్లి ఉషానిరుద్ధుల నిరువురిని ఒక స్యందనంపై కూరుచుండబెట్టి ప్రగాఢభక్తిభరితుడయి శౌరికి నివేదించాడు.

శ్రీకృష్ణభగవానుడట్టు పిమ్మట నూతన వస్త్రాలతో అలంకారాలతో విభూషితులయిన ఆ నూతన వధూవరులిరువురిచేత శంకర భగవానునికి నమస్కరింపజేయించి అతని అనుమతి పొంది వారితోబాటు ద్వారకాపురికి తరలిపోయినాడు.

ఆ శుభవర్తమానం విన్న ద్వారకానగర వాసులెల్లరు తోరణాలతో, పతాకాలతో రంగవల్లికలతో తమ నగరం కన్నులపండువుగా అలంకరించి అనేక మంగళవాద్యాలతో శ్రీకృష్ణభగవానునికి స్వాగత సత్కారాలాచరించారు.

త్రిలోచన దేవునితో శ్రీకృష్ణభగవానుని సంగ్రామ గాథ, ఆపైన ఆ దేవాధిదేవుని విజయ వృత్తాంతము ప్రాతఃకాలంలో భక్తిశ్రద్ధలతో సంస్మరించిన ధన్యుల కెన్నడు పరాజయం సంప్రాప్తించనేరదు.

### నృగ నృపాల చరిత్రము

శ్రీ శుకమహర్షి యథాప్రకారంగా తన ప్రసంగం ప్రారంభించాడు.

(సశేషం)

### ★ స్టాఫ్ నర్స్ లు (సంజయ్ గాంధీ పోస్ట్ గ్రాడ్యుయేట్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్)

[1] ఖాళీలసంఖ్య: 264 [2] అర్హతలు: గుర్తింపు పొందిన యూనివర్శిటీ నుండి నర్సింగ్ లో డిప్లొమా + 3సం॥ల పని అనుభవం. [3] వయస్సు: 30 సం॥లు [4] జీతంస్కేలు: రు॥ 470-735 [5] చివరితేదీ: 31-12-88 [6] అప్లికేషన్ లు పంపుటకు చిరునామా: డైరక్టర్, సంజయ్ గాంధీ పోస్ట్ గ్రాడ్యుయేట్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్, పోస్ట్ బాక్స్ నెం. 375, రాయ్ బరేలి రోడ్, లక్నో-226 001 [7] పూర్తి వివరాలకు 14-12-88 నాటి హిందూ దినపత్రిక చూడగలరు.

### ★ క్లర్క్ లు గ్రేడ్ -1/గ్రేడ్-11 (రైల్వే రిక్రూట్ మెంట్ బోర్డు)

[1] ఖాళీలసంఖ్య: గ్రేడ్-1:132; గ్రేడ్-11:151 [2] అర్హతలు: గ్రేడ్-1: గుర్తింపు పొందిన యూనివర్శిటీ డిగ్రీ; గ్రేడ్ - 11: 50%తో మెట్రిక్యులేష[న్] [3] వయస్సు: 18-25 సం॥లు [4] జీత[ం] స్కేలు: గ్రేడ్-1: 1200-1400; గ్రే[డ్]-11 : 950-1500 [5] చివరితేదీ 31-12-88 [6] అప్లికేషన్ లు పంపుట[కు] చిరునామా: అసిస్టెంట్ సెక్రటరీ, రైల్[వే] రిక్రూట్ మెంట్ బోర్డ్, రైల్వేకాలనీ (వెస్ట్) జమ్ముతావీ [7] ఇతర ఉద్యోగాల సమాచారానికి, అప్లికేషన్ నమూనాకు పూర్తి వివరాలకు: 26-11-88 నాటి ఎంప్లాయ్ మెంట్ న్యూస్ చూడగలరు.

### ★ రీసర్చ్ సైంటిస్ట్ లు (భారత్ ఎలక్ట్రానిక్స్ లిమిటెడ్)

[1] ఖాళీలసంఖ్య: 25 [2] అర్హతలు: బి.టెక్. డిగ్రీ, ఎమ్ టెక్ లేదా పి.హెచ్.డి అదనపు అర్హత + 0-10సం॥ల అనుభవం [3] వయస్సు: 40 సం॥లు [4] జీత[ం] స్కేలు: రు॥3000-5850 [5] చివరితేదీ 31-12-1988 [6] అప్లికేషన్ లు పంపుటకు చిరునామా : అడ్వర్ టైజ్ మెంట్ నెం సి.ఆర్.ఎల్/1/88, మేనేజర్ (పర్సనల్) భారత్ ఎలక్ట్రానిక్స్ లిమిటెడ్, సెంట్రల్ రీసర్చ్ లేబొరేటరీ, సెకండ్ ఫ్లోర్, శంకర నారాయణ బిల్డింగ్, 25, మహాత్మాగాంధీ రోడ్. బెంగళూర్-560001 [7] పూర్తి వివరాలకు: 10-12-1988 నాటి టైమ్స్ ఆఫ్ ఇండియా కాని, 13-12-88 నాటి హిందూ కాని చూడగలరు.

### ★ సైంటిస్ట్ 'బి'లు (బొటానికల్ సర్వే ఆఫ్ ఇండియా)

[1] ఖాళీలసంఖ్య: 14 [2] అర్హతలు బొటనీ/హార్టికల్చర్ లో మాస్టర్ డిగ్రీ [3] వయసు : 35 సం॥లు [4] జీతం స్కేలు: రు॥ 2200-4000 [5] చివరి తేదీ : 9-1-1989 [6] అప్లికేషన్ లు తెప్పించుకొనుటకు, పంపుటకు చిరునామా: సెక్రటరీ, యు.పి.ఎస్.సి., న్యూ ఢిల్లీ-110011 [7] పూర్తి వివరాలకు: 10-12-1988 నాటి ఇండియన్ ఎక్స్ ప్రెస్ చూడగలరు.

సేకరణ : వసంత

నవ చిత్రకథ నవ చిత్రకథ నవ చిత్రకథ నవ చిత్రకథ

# పాఠకులకు శుభవార్త!







ఆంధ్రుల అభిమాన సంస్థ

**ఆంధ్రపత్రిక**

అందిస్తున్న అపురూప ప్రచురణ

# నవ చిత్రకథ





ఆంధ్రపత్రిక వారపత్రిక సైజులో
ఆణిముత్యంలా ముస్తాబై
అతి త్వరలో నే వెలువడుతుంది

## నవ చిత్రకథ

పూర్తిగా బొమ్మల కథలతో
పుట్టెడు కార్టూన్ కథలతో
చిత్రమైన అంశాలతో వెలువడే

## రంగుల మాస పత్రిక



తెలుగు పత్రికా రంగంలో
వినూత్న ప్రయోగంగా
తొలిసారిగా వెలువడుతున్న

## కామిక్స్ మాస పత్రిక





ప్రతి అంశంలో వినోదం
ప్రతి విషయంలో విజ్ఞానం
సమ పాళ్లలో నింపుకున్న

## మానసిక వికాస దీపిక

ఉత్కంఠ, వైవిధ్యం ఊపిరిగా
ఉన్నత ప్రమాణాలకు వేదికగా
విశిష్టంగా వెలువడే

నవ చిత్రకథ **పూర్తి బొమ్మల మాస పత్రిక** నవ చిత్రకథ

# క్రీడాకారుల ప్రాణాలు తీసే అనబోలిక్ స్టెరాయిడ్స్ - బ్లడ్ డోపింగ్

సియోల్ ఒలింపిక్స్‌లో అపశృతి ఉత్ప్రేరకాల వాడకం. సెప్టెంబరు 24న బెన్ జాన్సన్ వందమీటర్ల పరుగు 9.79 సెకండ్లలో పరుగెత్తి సంచలనం సృష్టించిన 60 గంటల్లో అనబోలిక్ స్టెరాయిడ్స్ అనే ఉత్ప్రేరకాలు వాడినాడని నిర్ధారణ వలన స్వర్ణ పతకం కోల్పోయాడు. అలాగే వెయిట్ లిఫ్టింగ్, స్విమ్మింగ్ మరికొన్ని క్రీడలలో అగ్రగాములు పతకములు కోల్పోయారు. ఈ ఉత్ప్రేరకాలు ఒలింపిక్స్ క్రీడల్లో ముఖ్యముగా అథలెట్స్ వాడకం సియోల్‌లో మొదటిసారి కాదు. మ్యూనిక్ ఒలింపిక్స్‌నుండి ఎక్కువగా ఉపయోగించుచున్నారని నిర్ధారణ అగుటవలన అంతర్జాతీయ ఒలింపిక్ సమాఖ్య ఉత్ప్రేరకాలు వాడకం నిషేధించుటయేగాక పోటీల సమయంలో ప్రత్యేకవైద్యపరీక్షలు నిర్వహించుచున్నది.

1935లో కొచ్చికియాన్ అనే వైద్య శాస్త్ర నిపుణుడు పురుష మూత్రము ఆడ కుక్కకు యింజక్షన్‌ద్వారా ప్రవేశ పెట్టుట ద్వారా దాని శరీరములో స్త్రజని ఉత్పత్తి అధికమగునని, ఆ మగ కుక్క లక్షణాలు దానిలో కనిపించునని కనుగొన్నారు. మరి కొంత పరిశోధన తర్వాత "ప్రోటీన్ అనబోలిక్"గుణముకనిపెట్టబడినది, ఆ తర్వాత "టెస్టో స్టెరోయిడ్" వలన మానవ శరీరములో స్త్రజని, కండలు పెరిగి శక్తి కలిగించునని తెలుసుకున్నాడు. టెస్టో స్టెరాయిడ్ వలన ఎముకలు అభివృద్ధి, గట్టిపడుట. కండరములు పెరుగు లాభములు, ఆరోగ్యము, కంటిచూపు క్షీణించు నష్టములున్నవి.

కొంతకాలము తర్వాత క్రీడాకారులు "అనబోలిక్ స్టెరాయిడ్స్" వాడుట ప్రారంభించారు. దీనిని యంత్ర ఔషధముగా వాడి కండలు పెంచుట, శరీరములో శక్తి కలిగినట్లు చేయుటకు దానివలన జరుగు ప్రమాదము సహితము లెక్కించక వాడుట ప్రారంభించారు. 1977లో 12ఏళ్ళ బెన్‌జాన్సన్ 160 సెం.మీ. ఎత్తు, 42 కెజీల బరువు కలిగి బలహీనముగా యుండెడివాడు. కోచ్ చార్లీ ఫ్రాన్సిస్ బెన్‌జాన్సన్‌ను పనికిరానివాడు అనేవాడు. పది ఏళ్ళలో ఉత్ప్రేరకాలు- అనబోలిక్ స్టెరాయిడ్స్ వాడకంలో భారి విగ్రహం, ఎదిగినకండలు, సంచలనాత్మక అథలెట్ అయ్యాడు.

అనబోలిక్ స్టెరాయిడ్స్ యీ దశా-



బ్దపు వైద్య విజ్ఞాన నిదర్శనము. పురుషనిలో "స్పెర్మటోగెనిసిస్" అభివృద్ధి పరిధి ఆకారము, శక్తిలో అపూర్వ మార్పు తెచ్చును. టెస్టోఫెరిక్, ఆండ్రోస్టెని జెమోసిల కలయిక యింకా ప్రభావము కలిగించును.

అనబోలిక్ స్టెరాయిడ్స్ ప్రభావం కొన్ని గంటలు యుండి, కొన్ని నిముషాలు పోటీలలో ఉత్తేజము కలిగించును. ఈ స్టెరాయిడ్స్ అన్ని 'స్టైరో ఫెంటాన్ ఓ ఫెరిడ్రా ఫెన్‌ఫేన్' కలయిక. స్టెరాయిడ్స్ వలన కాలేయము, మూత్రపిండములు, గుండెకు అపారనష్టము జరుగును. రొమ్ము పెరుగుట. మూత్రపిండాలు కుదించుకు పోవుట. రతియందు ఆసక్తి లేకపోవుట జరుగును. మహిళాక్రీడాకారిణులలో పురుష లక్షణములు, వెంట్రుకలు, మీసాలు, గడ్డాలు వచ్చుట. 'క్లిటోరిస్' పెరుగుట ఋతుక్రమములో మార్పు, ఆగిపోవుటయందును, స్త్రీ ఆకారములో పురుషుడు పెరుగుట జరుగును. జీవితకాలము తగ్గును. ఉదాహరణకు పశ్చిమ జర్మనీ ఎథిలెట్ బ్రైట్ రస్సెల్ అనబోలిక్ స్టెరాయిడ్స్ వలన హెప్టాత్లాన్‌లో 33వ స్థానమునుండి ఆరవ స్థానము చేరకలిగినది. కాని 1977 ఏప్రిల్‌లో స్టెరాయిడ్స్ ప్రభావం వలన 26వ యేట మరణించినది. స్టెరాయిడ్స్ వాడకం తెలియకుండా యుండుటకు 'ప్రోబినసిడ్' వాడుతారు.

'బ్లడ్ డోపింగ్' మరొక పద్ధతి. వైద్య పరీక్షలో కనిపెట్టుట కష్టము. క్రీడాకారుడు తన శరీరములోని షుమారు లీటరు రక్తము పోటీలకు కొంతకాలం ముందు తీసి 'కోల్ స్టోరేజి' (శీతోష్ణస్థితి)లో యుంచి, పోటీ సమయములో తిరిగిశరీరములోనికి ఎక్కించుకొనును. దీనివలన 'ఆక్సిజన్' పెరుగును. దూరపు పరుగు, ఫుట్‌బాల్, హాకీ యితర క్రీడాకారులు ఆచరించు పద్ధతి యిది.

తన ప్రాణాలను సహితము లెక్కించక ఒలింపిక్ విజయాలకు యీ స్టెరాయిడ్స్ క్రీడాకారులు కోరుకుంటారు. ఈ ప్రమాదకరమైన ఉత్ప్రేరకాలు ఆ దేశ క్రీడాకారులకు లభిస్తున్నాయి అంటే ఆ దేశ ప్రభుత్వమునకు తప్పక తెలిసియుండాలి. ఒలింపిక్ పతకాలకై క్రీడాకారులను బలి యిచ్చుట యిదే అనవచ్చును.

- షుకరమ్

# చిన్న తెర

పల్లవి : సినిమా తలుపులు తెరుచుకున్నాయి.

కామ్యా మల్హోత్రా కష్టాలు కడతేరాయి.

## పల్లవి

నెమ్మది నెమ్మదిగా విజయం ఎలా సాధించాలో ఎవరైనా పల్లవీజోషీని చూసి నేర్చుకోవాలి. టి. వి. లో విజయం సాధించిన తర్వాత క్రమంగా సినిమాల్లో కాలు పెడుతోంది. 'అంధా యుద్ధ్' లో మంచి పేరు సంపాదించింది. ఈ సినిమా బాగా హిట్ అయింది. అంచాత బొంబాయి నిర్మాతల దృష్టి ఈమె పై పడింది. ప్రస్తుతం పల్లవీకి చాలా ఆఫర్స్ వున్నాయి. ఒకటి అమితాబ్‌తో. అంటే అతని సరసన అనుకోవద్దు. సినిమా వ్యహారాలలో తల మునకలవుతూ వుండటం వల్ల టి. వి. సీరియల్‌కు టైం చాల్లటం లేదుట. పెద్ద తెరకు ఎడ్జస్ట్ అవటానికి పల్లవి తక్కువ శ్రమ ఏమీ పడ్డేదు. 'తృష్ణాగ్ని'లో 'ఉత్తేజ కరమైన' సీన్సులో నటించటానికి పల్లవి ఆనందంగా ఒప్పుకుంది. సోనమ్, కిమీ కాట్‌కర్ వేసిన ఎత్తులే పల్లవి కూడా వేస్తోందేమో! నిలదొక్కు కోవాలంటే తప్పుతుందా మరి!

## రోమా తాపత్రయం

'మహా భారతం'లో అనేక మంది కొత్త కళాకారులు వుండటం ఒక విశేషం. మాండవీగా నటించిన రోమా మాణిక్ సినిమాల్లో అడుగు పెట్టేందుకు అనేక తంటాలు పడుతూంది. బాహాటంగా తన ఫొటోలు వేయించుకుంటుంది. కానీ ఏమంత స్పందన కలగటం లేదు. సినిమాల్లో చిన్న చిన్న పాత్రలతో, మాడలింగ్‌తో ఆమె సరిపెట్టు కుంది. కానీ ఇప్పుడు పరిస్థితి కొంచెం మారేట్టు ఉంది. నిర్మాతల దృష్టి ఆమెపై పడవచ్చు అందుకే ఇప్పుడు తరచు నిర్మాతలను కలుసుకుంటోంది. అనేక సినిమా పార్టీలలో ఉత్తేజకరమైన దుస్తుల్లో తిరుగుతూ రోమా నిర్మాతలను రోమాంచితులను చేయాలని తాపత్రయ పడుతుంది.



రోమా : ఇప్పుడు దృష్టి పడవచ్చు

## కామ్యా మల్హోత్రా మరో జన్మ

చాలా కాలం తర్వాత కామ్యా మల్హోత్రా చాలా ఆనందంగా కనబడుతూంది. టి.వి. లోనే కాకుండా సినిమా ఛాన్సులు కూడా వస్తున్నట్లు ఎంతో గర్వంగా చెబుతూంది. కారణాలు ఆమె చెప్పక పోయినా, అందరికీ తెలిసినవే! కనుమరుగవుతున్న ఆమె ముఖం 'ముంగేరీలాల్‌కే హసీన్ సప్నే' వల్ల మళ్ళీ వికసించింది. 'బునియాద్'లో కామ్యాను ఎలా తొలగించారో, దాంతో ఆమె కెరీర్ ఎంత కుచించుకు పోయిందో చాలా మందికి తెలుసు. ఆమెకే కాదు, ఏ కళాకారుడికైనా అలాంటి విషమ పరిస్థితి వస్తే కష్టమే. కానీ యిప్పుడు ఆ స్థితి నుండి కామ్యా బయట పడింది.

కొచ్చర్లకోట వెంకటసుబ్బారావు.